

రవికిషోర్

స్రవంతి మూవీస్

# వారసుడొచ్చాడు

ఎ. మోహనగాంధి

కె. శారదాదేవి



National Integration Day - Oct 31

JAGATI Rs. 3-00 December 1988

34th Year of Publication




# దీపావళి - 1988



దీపం జ్యోతి పరబ్రహ్మ
దీపం సర్వ తమోపహం



'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600004
ఫోన్ : 76697 — సం॥ చందా రు. 24-00. 2 సం॥లకు రు. 45-00. 5 సం॥లకు రు. 100-00. జీవిత చందా రు. 300-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం : పండిట్ నెహ్రూ

బెజవాడ గోపాలరెడ్డిగారి
రవీంద్ర నాటికలకు

# ముట్నూరివారి పరిచయ వాక్యములు

ఏ వినీలాకాశ గర్భము నుండి, ఏ యుగారంభ సంరంభమున, భారత పరిజ్ఞానామృతము అవనికి దిగివచ్చెనో, ఎవరు చెప్పగలరు? ఇయ్యది కాలము వలెనే అనంతము — ఆకసము వలెనే సర్వవ్యాప్తము !

కొండొక కాలమున ఉషఃకాంతులు తమస్సులను జీల్చుకొనుచు చేతనా చేతన ప్రకృతిని మేల్కొలుపుచుండ, మన పూర్వులు విస్మయానందముల నోలలాడుచు, మంచుతెరల చాటున మూర్తులుగనో, అమూర్తులుగనో, దృశ్యాదృశ్యముగ గోచరించు జగదంతర ప్రవర్తకులైన దేవతల పరిచయము గావించుకొని ఋక్సామములలో ఉద్గీథములను బాడ దొడగిరి.

క్రమముగా — దేశ కాలముల ఎల్లలు కూడ దాటి, అవాఙ్మానస గోచరమైన అఖండ సచ్చిదానందమును స్పృశించి— ఔపనిషదిక రహస్యములను ముక్తకంఠముతో నుద్ఘాటించిరి.

అటుపిమ్మట, భారత విజ్ఞాన మహాతరంగిణి జాహ్నవివలె హిమాలయోత్తుంగ శృంగముల నుండి దుమికి, సాంద్రారణ్యముల నిబిడచ్ఛాయల విశ్రమించుచు, మానవ లోకమునందు ప్రవహించి, మానవుని కళ్యాణ గుణములను మూర్తీభవింప జేసుకొనిన అవతార పురుషుల లీలావిలాసములను బ్రతిఫలింపజేయ, పురాణేతిహాసములను జిత్రించిరి.

అంతెక్కడిదీ జ్ఞానధారకు ? ఒకప్పుడు జ్యోత్స్నావీచికయై, శుభ్ర హిమ ఖండములతో గ్రీడించుగాక ! స్నిగ్ధ జాహ్నవియై గగన చుంబిత శృంగముల నుండి ఉరికి వనాంతర సీమల యందు విజయ విహార మొనరించు గాక !

మరి ఒకప్పుడు ఆ అమల విమల వాహిని రాజాధిరాజుల నికటముననో, జనపదముల చెంతనో, శీతకణములను వెదజల్లుచూ మానవుని సేద దీర్చుచుండుగాక ! కాని ఈ వాహిని అవిచ్ఛిన్నము, లోక సంతాపహరము, బ్రహ్మానంద సంధాయకము.

\+ \+ \+

దీని నిర్మాణ శక్తియు అత్యద్భుతము : ఇయ్యది పర్వత శ్రేణులన సహితము తొలచి, అందు విజ్ఞాన దీపములను వెలిగించినది. సాంద్రారణ్యములలో ఆశ్రమములను, పర్ణ

కుటీరములను నెలకొల్పి తత్వ సారమును చిలికించినది.

కవి బృందములను సృష్టించి, వారి కావ్యరంగములపై దివ్య సుందరియై నర్తించినది. శిల్ప భూములలో పసిడి తళుకుల గోపురములను నిర్మించుకొని, నీరాజనములతో కళారాధనల నందినది.

ఎట్టి సృజన శక్తి ఇది? ఎన్ని దర్శనములు, ఎన్ని మతములు, ఎన్ని సంప్రదాయములు, ఎన్ని సాధన విధానములు, పాథోధిలోని తరంగ సంతతులవలె ఉద్భవించి తన గంభీర సమృద్ధిని వెల్లడించ గలిగెను.

భారతేతిహాసమున ప్రతిఘాతము లైనఘట్టములు సంఘటింపక పోలేదు. కాని వానికి భారతశక్తి వంగి నేల కూలెనా? లేదు. రోషముతో బరాక్రమించెనా యనునటుల, తరంగితమై ఘూర్ణిల్లి, కూలములనుగూడ దెగగోసుకొని, ప్రాంత ప్రాంతమునకు, నగర నగరమునకు పల్లె పల్లెకూ పరువులెత్తి బహుళ వ్యాప్తి నొందినది.

విభిన్న దేవతోపాసకుల మధ్య వివాదములు పెరిగి సంఘర్షణలు కలిగినప్పుడు మహోదారులైన ఋషి పుంగవులు బయల్వెడలి "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" అను మహా వాక్యమున విశ్వైక్యతను జాటిరి.

మరి ఒక సంఘట్టమున శ్రీ కృష్ణ భగవాను డవతరించి, సకల దర్శనములను సమన్వయపరచుచు, భక్తి జ్ఞాన కర్మములకు ఏకవాక్యతను గూర్చెను.

ఇంకొక ప్రదోష కాలమున బుద్ధ దేవుడు ఏతెంచి, లోక దుఃఖ నివృత్తి సాధకమైన కరుణరసము దేశదేశముల వెల్లి విరియునట్లు ప్రవహింప జేసెను.

ఇస్లాం సభ్యతా సంఘట్టనమున చైతన్య, చండీదాస్, కబీర్, నానక్, తులసీదాస్, రామదాసుల వంటి భక్త వరేణ్యులు శ్రేణులు దీర్చి జాతి, మత, భాషా విచక్షణల నతిక్రమించి సార్వజనీనముగ, భక్తి రసామృతమును—మాతృభాషలలో, దేశీయ గీతములలో, జీవన సరళ సంబంధములలో, పాడి, ఆడి, వెదజల్లి భారత సంస్కృతిని నవనవోన్మేషశాలినిగ నొనర్చిరి.

ఇటీవల పాశ్చాత్య నాగరకతా పదాఘాతమునకు భారతవర్షము దద్దరిల్లి, స్వధర్మ భ్రష్టమగుచుండ, చందన తరువును నరికిన కొలది పరిమళమును వెదజల్లు రీతి భారతావని యందెందరో మహానుభావులు జాగరితులై, ప్రాక్తన దివ్య విజ్ఞానమును సువ్యక్త మొనరించి ఖండ ఖండాంతరములు భారత జ్ఞాన సంపత్తికి మోకరిల్లునట్లు చేసిరి.

* * *

ఈ జ్ఞానోద్ధారకులలో ముఖ్యముగ మువ్వురు మనీషులు నవ్య భారత భాగ్యోదయమునకు త్రిమూర్తులా యనునట్లుద్భవించిరి. శ్రీ అరవింద యోగీంద్రుడు, శ్రీ కరుణ చంద్ర మోహన్‌దాస్ గాంధి, శ్రీ రవీంద్రనాథ్ కవిచంద్రుడు.

భారత విజ్ఞాన శక్తి సత్యమును వ్యవచ్ఛేదనము గావించి అంగ

ప్రత్యంగ పరిశీలనము చేయగలదు— ఒక్కుమ్మడి సమగ్ర సమన్వయ దృష్టితో అఖండ తత్వమును తిలకించలదు.

భారతీయుని తత్వదృష్టికి రెండు చూపులు గలవు. సముద్రతీరము నందలి ఇసుక రేణువులను ఒక్కొక్కటి తీసి లెక్కపెట్ట సాహసించును - సముద్రమునంతకు అపోశనము పట్టి ఒక మారు "స్వాహా" అనగలదు.

భారత గణిత శాస్త్రజ్ఞులు గ్రహ గ్రహముల, నక్షత్ర నక్షత్రముల గమనముల, పరిభ్రమణముల గుణించి, శాస్త్రీకరించిరి. వారే అఖిలాండ బ్రహ్మాండకోటుల నతిక్రమించి, లెక్కలకు, కొలతలకు అందని అనంత ధామమునకు గొంపోయిరి.

భారత కళాభిజ్ఞులు ప్రకృతి పురుషులకు అనంతరూపములను గల్పించి అంగప్రత్యంగ వివరణములను హృదయరంజకముగ చిత్రించిరి. ఈ పార్థివ భేదముల నతిక్రమించి సచ్చిదానందముయొక్క అఖండతత్వమునకును మూర్తి కల్పనజేసిరి. భారత దర్శకుని తీక్ష్ణదృష్టి అణువును గనుపెట్టగలదు. అవ్యక్తమైన మహత్తును తిలకించి, నిరతిశయానందమున నోలలాడ గలదు.

భారత జ్ఞానసంపదయొక్క విశిష్టత ఈ త్రిమూర్తులయందును ప్రస్ఫుటముగ వ్యక్తమగుచున్నది. వీరి దృష్టి వజ్రభేదివలె లోలోతులలోకి జొచ్చుకొని పోగలదు. అన్నిటినీ మించిన అతీతమునకు ఎగురగలదు - కన కనే వీరు పశ్చిమఖండవాసుల వైజ్ఞానిక పరిశీలనా పటిమను ప్రాచ్యదేశాల సమగ్ర భావనాశక్తిని తమయందిముడ్చుకొని నూతన సమన్వయమునకు దారి తీయగలుగుచున్నారు.

శ్రీ అరవిందుడు బ్రహ్మవిద్యాగరిష్ఠుడై మానవుని మర్త్యజీవనమును సహితము దివ్యజీవనముగ పరిణతి నొందించగల "పూర్ణయోగ" విధానము నుదాత్తస్వరమున నుద్బోధించుచున్నాడు.

గాంధీమహాత్ముడు — జాతీయ దురహంకార పరితప్తమైన పృథివిని శాంతింపజేసి, విశ్వమైత్రీ భావమున నేకమొనర్చుటకు అహింసా ధర్మమును అపూర్వరీతిని ఆచరించి ప్రదర్శించుచున్నాడు.

ఇక మన మధురమూర్తి రవీంద్ర కవిచంద్రుడు, ప్రపంచమును సమ్మోహపరచునటుల "విశ్వభారతీ" గీతములను సర్వ ప్రపంచమునకు అంజలిగ నివేదించి, రసజగత్తుయొక్క సౌందర్య శోభ నవఘళింప జేయుచున్నాడు.

ఈ త్రిమూర్తులు భారతవర్షమున ఏకకాలమునందు ప్రభవించి, విశ్వకల్యాణ గీతమును ముక్తకంఠములతో నాలపించుట ఈశ్వరుని సవ విధానము గాక మరియేమగును?

భారత సభ్యత విశిష్ట లక్షణములు గలదనుట సత్యము. కాని ఇది ప్రత్యేకముగ ఏ భూభాగపు ఎల్లల మధ్యను బంధింపబడునది కాదు. ఏ జాతీయ సంప్రదాయమునందును ఇముడునది కాదు. అది సత్యమువలె

నిత్యమై, విశ్వవ్యాప్తమై వెలుగొందుచు, భరతవర్షము జగద్గురు పీఠముగ నుండుటకు దగిన సంస్కార యోగ్యతను, జ్ఞానబలమును ఒసగు చున్నది. ఈ గురుపీఠస్థానమునకీ త్రిమూర్తులకంటె అధికారులెవరు?

శ్రీ అరవిందుడు మర్త్యుని అమర్త్యు నిగ జేయగల జ్ఞానబలమును, మహాత్ముడు ఆత్మశక్తియొక్క అమోఘత్వ మును, శ్రీ రవీంద్రుడు ఆత్మసౌందర్య గరిమను అపూర్వరీతిని - రణకోలాహలమునందు మునిగియున్న ప్రపంచము సహితము చెవియొగ్గి వినునటుల ప్రబోధింపుచున్నారు.

అరవిందుని దార్శనిక గ్రంథములు ఆంగ్లమున నుండుటచే విదేశములలో నొకింత ప్రచారవ్యాప్తి గాంచిననూ, దేశమునందు ఎక్కువగా బరింప బడుటలేదు. మహాత్ముని అహింసా తత్వము కర్మయోగసంబంధమైన దగుటచే వారి సేవాతత్పరతయే ప్రజలకు ప్రత్యక్ష ప్రబోధమగు చున్నది. అరవిందుని దివ్యోప దేశములను సులభముగా తెనిగించ వచ్చును. మహాత్ముని కార్యప్రణాళికను ప్రకటించి వారి అహింసా మహత్తును నెరుకపరచవచ్చును.

కాని రవీంద్ర కవిచంద్రుని కవితా మాధుర్యము ననువదించు టెట్లు? రవీంద్రుని రచనలు కొన్ని ఆంగ్లీ కరింపబడినవి. కాని అతని కవితలోని సారస్యము వానియందు మచ్చుకైనను గానరాదు. రవీంద్రుని గ్రంథములు కొన్ని ఇదివరలో తెనిగింపబడినవి. ఆ అనువాదములు, మాతృకలకు కొన్ని మైళ్ల దూరములో నున్నవి. ఈ ప్రయత్నములను గాంచిన, కవిత కను వాదము దుస్సాధ్యము అనిపించును. త్యాగరాజాచార్యుని రాగమాధుర్యము ను ఎవరనువదింపగలరు? "ఈథర్" ద్రావకము నొక సీసానుండి ఇంకొక సీసాలోనికి మార్చుటెంత దుస్సాధ్య మో, 'అభిజ్ఞాన శాకుంతల' మును ఆంగ్లీకరించుటంత కష్టసాధ్యమని మానియర్ విలియమ్సు వెనుక వ్రా క్రుచ్చియున్నాడు.




# జి. పుల్లా రెడ్డి

## స్వచ్ఛమైన నేతి మిఠాయి

హైదరాబాదు
ఫోను : 230833

కర్నూలు
ఫోను : 20288, 21445




గోపాలరెడ్డిగారు శాంతినికేతన పట్టభద్రులు. రవీంద్రుని ప్రియ శిష్యులు. వంగ భాషాకోవిదులు. రవీంద్రుని కవితా మాధుర్యము నెటు లైన సోదరాంధ్రులకు జవిచూప వలె నని ఎంతకాలము నుండియో ఆవేదన పడుచుండిరి. దాని నెంత కాలము దాచియుంచగలదు కవితా హృదయము ?

నేడు—సాహసమే కానిండు—ముందుగ రెండు నాటికలను ఆంధ్ర లోకమునకు బ్రసాదింప సమకట్టిరి. కాని రవీంద్రుని భాష — ఆ కాలమున సంస్కృతపద భూయిష్ఠమై యుండు టచే, ఆ భాగములను తెలుగు లిపిలో లిఖించిన, దాని మాధ్యుర్యమును గొంత వరకు గ్రోలగలుదుము. రెడ్డిగారు సాధ్యమైనంతవరకు రవీంద్రుని పద ముల కూర్పును, ప్రయోగముల రీతిని, శయ్యావైఖరిని నిలుప ప్రయత్నించిరి. ఇందు మూలమున తెలుగు నుడి కారమునకు గొంత కొరత వాటిల్లినను, రవీంద్రుని పలుకుబడిని మనకొకింత శ్రుత పరుపగలుగుచున్నారు.

రవీందుని భాషా శైలి వానిదే కాని, అనుసృతమైనది కాదు. కవి నిరంకుశప్రభువు. అవ్యక్తమైన రసాను భవమును వ్యక్తపరచుటకు ప్రతిభా శాలియైన కవి తన భాషను తాను సృష్టించుకొనును. మానవుని స్వప్రయోజనముల కొరకు కల్పించు కొన్న వ్యావహారికభాష కవులకు జాలదు. మానవుని భాష అర్ధముల బంధించుకొని వ్యావహారిక ప్రయోజన ములకొరకు సంకుచితమై, ఒక పరి మితిని బొందునని రవీంద్రుడే "నారద — వాల్మీకి" సంవాదమున బహురమ్య ముగ వర్ణించినాడు. ప్రభాత శుభ్రభాష వలె, యామినీ శాంతివాణివలె, నక్షత్ర ముల నిశ్చల ధ్రువగానమువలె, దక్షిణ సమీరముల ఉచ్ఛ్వాసలవలె —తన భాషకూడ అర్ధబంధముల నతిక్రమించి, ఏకస్రోతమైన సంగీత తరంగముల మేళవించి, యౌవన విజయగానముల గావించవలెనని రవీం ద్రుడు విశ్వసించిని ప్రాయించెను.

వాల్మీకి ముఖతః ప్రతిధ్వనింప జేసిన ఈ దిగువ వాక్యములు రవీం ద్రుని భాషాసంపదను చెప్పకయే చెప్పును- -

"మానవుని చిరవాక్యములకు నా ఛందము నవస్వరముల నొసగి, ఉద్దామ సుందరగమనము నొసగూర్చి, పక్షవంతమగు అశ్వరాజసమముగ, అర్ధబంధము లనుండి తప్పించి, భావ స్వతంత్రలోకమున గొంపోదూరము గొంపోగలదను నాశ్వాసము నా చిత్తము దెలుచుచున్నది."

+ + +

రవీంద్రుని కౌమారదశలో రచించి నవి రెండు—కచదేవయాని, చిత్రాం గద — నాటకలు. వసంతఋతు సమా గమమున, యౌవన విలాస సంపద లొక్కుమ్మడి యెట్లు విజృంభించి, ఉన్మత్తత కలిగించునో, అట్టి "కైపే" ఈ నాటికలును కలిగించును.

ఆనాడు రవీంద్రుడు కేవలము రసోన్మాదుడు. మత్తేభమువలె కృతో

ద్యాన వనముల విహరించి, కమల కాసారములలో అవిచ్ఛిన్నముగ నీదులాడుచు, హస్తరంధ్రముల నీరెక్కించి, పూరించి, వియత్పథంబున విరియజిమ్ముచూ, కోమలాట్టహాసము గావింపు నొకతూరి :— మరి ఒక మారు, లతానికుంజముల విదలించి, కుసుమ సంతతులను రాలించి, మూగిన మధుప సంతతులను అదరించి, బెదరించి, ఆనంద రసోన్మత్తుడై అతిశయించును.

మరి ఒకమారు పర్వతసానువులపై నెగబ్రాకి, అచ్చట స్వైర విహార మొనరించు అప్సరాంగనల పూవుటెడదల సాధ్వసము రగిలించి విహ్వాలుడవును —ఇంకొకతరి తన మత్తకుంభముతో చందనతరువులపై బడి పోరాడి దిక్కు దిక్కులకు పరిమళమును విరజిమ్మి క్రీడించును.

మరి ఒకప్పుడు పర్వత శిఖరములపై శాంతిధ్యాన నిమగ్నులైన తపోధనులను సమాధుల నుండి అల్లన మేల్కొలిపి వారి జితేంద్రియత్వమును బరీక్షించును.

ఇంకొక మారు పర్వత సానువుల నుండి దుమికి కేరింతలాడుచు జరజర పల్లెల పూరి గుడిసెల ముందు ధూళి ధూసరితములైన కోమల శరీరములతో చిందులాడుకొను పిల్లగాండ్ర నెత్తి వీపుపై నిడుకొని, గంతులు వేయుచు ఏ వాత్సల్య రసజగత్తుకో మోసికొనిపోవును.—

అయ్యది భావోన్మాదక్రీడ, రసావేశావస్థ యందలి చిద్విలాసము, భూమిని స్వర్గమును ఐక్యపరచి మానవుని దేవ పీఠమున ఆసీనుని చేయగల సాధనామహిమ అది.

పవిత్ర భరతవర్షమున తత్వజ్ఞులు, యోగులు, శిల్పులు, కవులు, కళాభిజ్ఞులు ఏకశ్రేణికి చెందిన ద్రష్టలు:— స్రష్టలు. వారి ఉపకరణములు భిన్నములు కాని, లక్ష్యమునందు ఒకటే సిద్ధి—అద్వైత సిద్ధి.

రవీంద్రుని రచనామృతమును గ్రోలగల్గిన శ్రీమంతులు ఆనంద భోగులు కాకుండ నెట్లుండగలరు ? శ్రీ గోపాలరెడ్డిగారు ఈ ప్రథమకుసుమములతోబాటు, క్రమక్రమముగ రవీంద్రుని ఇతర రచనలను కూడ ఆంధ్రలోకమునకు అందించి విశ్వభారతి పూజను వ్యాపన మొనర్చెదరు గాక !

—ముట్నూరి కృష్ణారావు
(అగస్టు 1944 - బందరు)



భూతకాలమనేది ఒక శిల ; కొడవలితో కోసివేయబడే పసరిక వర్తమానం, అంచేత, బెదరక నిలిచేది గడిచిన దినాల జ్ఞాపకాలు.

—యూజిని హామిల్టన్

ఈ ప్రపంచంలో భరించలేనంత సౌందర్యం వుంది – ఒంటరి మనిషి అసలు భరించలేడు.

— రిచర్డ్

అమరపురి గ్రంథాలయంలో నిరంతరం పఠించదగినది స్వాతంత్ర్యగీతిక.

—లయిటన్



"Father, the other day my friend has said that Anjaneya is called Sundara and hence that Sundara Kanda in Ramayana ..." said Raghu.

"To every mother, don't you think, her offspring is a living beauty in flesh and blood. So, Anjana named her son as Sundara. Nothing wrong."

"Oh, this monkey-god being called Sundara - what mockery !"

"Raghu, you shouldn't be carried away by appearances. Anjaneya, otherwise known as Hanuman, Maruti, Pavani, etc. was an enlightened soul and he was of no consequence till he came across Rama. Thereafter he was only Rama Doota. He took a token from Rama and brought back a token from Seeta. Though he had a message to carry, he was not a simple messenger but an ambassador. His erudition and scholarship were of high value and he was a great musician too. You must remember that he never participated in the battle except to save Sugreeva from the clutches of Kumbha Karna. While Rama is worshipped for salvation, Anjaneya is said to give muscle, money, fearlessness and worldly possessions. That is the secret of his popularity," explained Raghu's father.

---

*Swadharma Swaarajya Sangha (Director: BVSS Mani*
*'Beehive' Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*
*(Ph: 514477)*



1976 జులై - ఆ నాలుగు రోజులు

# స్వాతంత్ర్య పత్రం

అమెరికాలోని పదమూడు వలసలూ మాతృదేశమైన ఇంగ్లండు నుంచి విడిపోవడానికి నిశ్చయించు కున్నాయి. అయితే, ఆయారాష్ట్ర ప్రతినిధులలో కొందరు, భయాందోళనలు వ్యక్త పరుస్తున్నారు. నాలుగు రోజుల డ్రామాలో మొదటిరోజు నడుస్తోంది ....

—ఇంక చదవండి

న్యూజెర్సీ మాటేమిటి? డెలవార్ సంగతి? డెలవార్ నుంచి వచ్చిన ముగ్గురు ప్రతినిధులూ ఏకాభిప్రాయంతో లేరు. మాకీన్ స్వాతంత్ర్య తీర్మానానికి సుముఖుడు, జార్జిరీడ్ వ్యతిరేకి. అతనిది రాక్షసి పట్టు. ఈ జార్జిరీడ్ ఎవరు చెప్పినా వినడు. మూడవ ప్రతినిధి అయిన సీజర్ రోడ్నీ, డెలవార్ లోని తనవ్యవసాయ క్షేత్రంలో వున్నాడు. మాక్కిన్ అతనికి తక్షణం కబురు పంపించాలి. దక్షిణ కెరోలినా కూడా అనిశ్చియముగా వుంది. న్యూయార్క్‌ని తమ వైపు తిప్పుకునే అవకాశమున్నదా? పెన్సిల్‌వేనియా ప్రతినిధుల మనసు మార్చగల మార్గము వున్నదా? జాన్ డికిన్సనూ తామూ నడిరోడ్డుమీద కుస్తీ పట్టవలసిందేనా? మళ్ళీ ప్రతిష్టంభన తప్పదా?

డికెన్సన్ తన ఉపన్యాసం ముగించి కూర్చున్న మీదట ప్రతినిధులు ఒకరినొకరు చూసుకోసాగారు. ఇంతటి ప్రజ్ఞతో కూడిన తర్కానికి, సందర్భోచిత సమాధానం ఎవరైనా చెప్పాలి. ఎవరు చెప్పగలరు యాడమ్స్ తప్ప! కాని జాన్‌యాడమ్స్‌కి డికెన్సన్‌కి వలె వక్తృత్వ ప్రతిభ లేదు. తన మనసులో గల భావాలను సూటిగా చెప్పగలడే తప్ప వాటికి సొగసూ సౌకుమార్యమూ సమకూర్చ లేడు.

రట్లెజ్ (దక్షిణ కెరోలినా) యాడమ్స్ వద్దకు వచ్చి 'ఇందుకు ప్రతివాదము చెప్పగల ధీరుడివి నీ వొక్కడివే - నీ అభిప్రాయాలు కూడ విన్న మీదట మేము ఒక నిశ్చయానికి వస్తాము' అన్నాడు.

యాడమ్స్ తన స్థానములో నిలబడి ప్రతినిధుల ముఖాలవైపు ఒక్కసారి చూసి, తను చెప్పదలచుకున్నది ప్రారంభించాడు. బయట తుపాను తగుముఖములో వుంది. కంచుకంఠంతో తమ దేశపు రాజకీయ స్థితిగతులను పర్యావలోకనము చేశాడు. తమ విన్నపాలు రాజుగారు ఆలకించడం లేదు. తమ కష్టాలు వినే ప్రభువు ఎవరూ లేరు. తాము పంపే మహజర్లు

బుట్టదాఖలు అవుతున్నాయి. తమ ఆలనా పాలనా కనుక్కునేవారు లేరు. మూడవ జార్జి ఈ వలసలన్నీ తిరుగుబాటు జరుపుతున్నాయని ప్రకటించాడు. మనమురాజుకు విరోధులమైపోయాము గనుక మనని ఈ కష్టములో ఆదుకునేందుకు ఇతర మిత్రులు కావాలి. మనని తిరుగుబాటుదారుగా రాజు ప్రకటించాడు గనుకనే ఈ స్వాతంత్ర్య తీర్మానాన్ని విడుదల చేయవలసిన ఆగత్యం మనకు ఏర్పడుతోంది. ఈ స్వాతంత్ర్య శంఖారవము వలసలన్నిటినీ ఏకోన్ముఖం చేసి, దేశాన్ని పటిష్టవంతముచేస్తుంది. ఈ వలసలు తిరుగుబాటు జరిపాయనీ, వాటి రక్షణ భారము తన కెంత మాత్రమూ లేదనీ మూడవ జార్జి ప్రకటించిన మీదట, మన మందరమూ ఐకమత్యముతో మనని మనము రక్షించుకొనక పోతే బ్రిటన్ పంపే కిరాయి సైనికులు మనని చిత్రవధ చేస్తారు. నార్త్ ప్రభువు ఈ మహానాటకములో నిరపరాధి. కాని రాజనీతిలో ఘటికుడు. అందుకనే శాంతి దూతలను సేనలతో పాటు పంపిస్తున్నాడు. బలవంతమగు సేనలు, శాంతి దూతలూ ఒకటై వస్తున్నపుడు వారి నిర్ణయాలే సంధి షరతులవుతాయి. గౌరవ, ప్రదమగు సమావేశాలకి ఎంత మాత్రమూ ఆస్కారము వుండదు. ఈ ఉత్కృష్ట పరిస్థితిలో మనకి గలవి రెండే రెండు మార్గాలు - స్వాతంత్ర్య తీర్మానాన్ని వాయిదా వేయడమనగా శత్రువుకి తల వొగ్గేందుకు అంగీకరించడము - అందుకు సంసిద్ధులమా మనము? ఎంత మాత్రమూ కాదు. అటువంటప్పుడు మనకున్న స్వల్ప ఆయుధ బలంతో, స్వశక్తితో, ఆత్మ సంరక్షణార్థము పోరాడేందుకు అంగీకరించాలి పోరు తప్పదని స్పష్టమైన మీదట ధైర్యముగా స్వాతంత్ర్యాన్ని ప్రకటించి, ప్రపంచములోని ఇతర దేశాల మన్నన, మైత్రీ పొందడములో నష్టమేమున్నది? మన స్వాతంత్ర్య కాంక్ష మనకు ఆయుధాలనూ, మిత్రులనూ సంపాదించి పెడుతుంది. మన మందరమూ ఒకటిగా వుంటే ప్రపంచము మనని ఆదరించి గౌరవిస్తుంది. నేను, నా జీవితాన్ని, ఈ ఉద్యమ విజయానికి ధార పోసేందుకు సిద్ధముగా వున్నాను. నా దేశప్రజలతో కలిసి జీవించేందుకూ, నశించేందుకు సంసిద్ధముగా వున్నాను. ఇదే నా స్థిర సంకల్పము. ఇదే స్వాతంత్ర్య తీర్మానములోని అంతరార్థము."

'వినండి - వినండి' అని శామ్యూల్ యాడమ్స్ బిగ్గరగా ప్రశంసించాడు. ప్రతినిధుల సమావేశంలో ఒక నూతనోత్తేజము కలిగింది.

అధ్యక్షుడు కార్యదర్శికి సూచన చేశాడు. కార్యదర్శి తన స్థానంలో నిలబడి తీర్మానాన్ని మొదటి వోటింగుకి పెట్టాడు. తొమ్మిది వలసలు తీర్మానాన్నీ బలపరిచాయి. పెన్సిల్వేనియా దక్షిణ కెరోలినా రాష్ట్రాలు అసమ్మతి తెలియబరిచాయి. డెలావార్‌లో విభజన ఏర్పడింది. శత్రునౌకా పంక్తులు నేడో రేపో ముట్టడి జరపడానికి సిద్ధముగా వున్నపుడు తాము తటస్థ విధా

వైరం ఏర్పడకుండానే సర్దుకుంటూ వచ్చాడు. ఈ రథాన్ని బోల్తా కొట్టకుండ లాక్కొస్తున్నాడు. కాని ఎవరూ అతని శ్రమను, ఓర్పును గుర్తించడం లేదు. వలసలలోని వారు తమ కష్టాలన్నిటికీ ఇతనే కారణభూతుడన్నట్టు తిట్టి పోస్తున్నారు. ఇక స్వదేశములోని ప్రత్యర్థివర్గం వారు, అయిన దానికీ కాని దానికీ ఇతనిని ఆడిపోసుకుంటున్నారు.

నార్త్ ప్రభువు ఇదివరకెన్ని తడవలో తన రాజీనామా పత్రము రాజుకి అందించాడు. మళ్ళీ రాజీనామాతో ప్రత్యక్షమయాడు రాజుముందు. ఇటువంటి విప్లవ సమయంలో తనకంటే సమర్థుడూ శక్తిమంతుడూ ప్రధానిగా వుండాలనీ, శతమొండి అయిన రాజుని వొంచగలిగితే తప్ప పరిస్థితులు తారుమారవుతాయనీ నార్త్ ప్రభువుకి భయము. భవిష్యత్‌లో తనకు అవమానము, దేశానికి అప్రతిష్ఠా తప్ప మరొక మంచి ఏమీ కనబడటంలేదు. ఈ మూడవ జార్జి అమిత అహంభావి, పరమ మూర్ఖుడు, తనకి విముక్తి ప్రసాదించమని మొరబెట్టుకుంటున్న నార్త్ ప్రభువుని ప్రధాన మంత్రిత్వము నుంచి తప్పించడానికి అంగీకరించని తంత్రజ్ఞుడు మూడవ జార్జి.

దేశంలో జరుగుతున్న యుద్ధ ప్రయత్నాలు ప్రజా క్షేమానికి హానికరమని ప్రధాన మంత్రికి తెలుసు. కాని రాజకీయంగా జాన్‌విల్కిన్ తప్ప మరెవరూ దీని గురించి అట్టే మాట్లాడ లేదు. రాజహితైషులతో నిండిన పార్లమెంటు రెండు సభలవారూ వలసలను దండనీతిలో దారికి తీసుకొని రావాలనే అభిప్రాయంతో వున్నారు. వ్యాపారస్తులూ పరిశ్రమదారులూ తమ వలస వ్యాపారము ఎక్కడ దెబ్బతింటుందోనని ఆందోళన చెందారు. కాని రష్యా, టర్కీ, స్పెయిన్, మధ్య ప్రాచ్యాలతో వ్యాపారము ఉధృతమై యుద్ధ మేఘాలు కొంచెము కనపడగానే వారు తెప్పరిల్లారు. ఇంగ్లండులోని గ్రామీణులు రాజ వాక్యాన్ని పాలించడమే తమ కర్తవ్యమని భావించసాగారు. పారిశ్రామిక విప్లవానంతరపు లండన్ కార్మికులు, రాజ శాసనం పాటిస్తూ తమ దేశభక్తిని వెల్లడించుకునేందుకు సిద్ధంగా వున్నారు.

కాని నార్త్ ప్రభువు క్లిష్టసమస్య ఏమిటంటే, తగినంత మంది సైనికులనీ నావికులనీ ఎక్కడనుంచి తీసుకురావడమని! ఇంగ్లండులోని సామాన్య ప్రజానీకానికి రాజుగారి పట్ల రాజభక్తి అయితే వుందిగాని అమెరికాతో జరుపగల యుద్ధానికి సమకూర్చగల అంగబలములేదు. అందువల్ల బయట దేశాల నుంచి కిరాయి సైనికులను చేర్చుకోవలసిన అవసరము ఏర్పడింది. సైనికులను సమకూర్చే నిమిత్తము మూడవ జార్జి తన ఏజంట్లను యూరప్‌లోని వివిధ దేశాలకి పంపాడు. హాలెండ్ రష్యా దేశాలు తమ దేశాలనుంచి సైనికులెవరూ రారని మొదట్లోనే స్పష్టపరిచాయి. కాని ధనాపేక్ష గల జర్మనీలోని సామంత రాజులు, తమ రక్త బంధువూ వంశాబ్ధి చంద్రుడూ అయిన

వైరం ఏర్పడకుండానే సర్దుకుంటూ వచ్చాడు. ఈ రధాన్ని బోల్తా కొట్ట కుండ లాక్కొస్తున్నాడు. కాని ఎవరూ అతని శ్రమను, ఓర్పును గుర్తించడం లేదు. వలసలలోని వారు తమ కష్టా లన్నిటికీ ఇతనే కారణభూతుడన్నట్టు తిట్టి పోస్తున్నారు. ఇక స్వదేశములోని ప్రత్యర్థివర్గం వారు, అయిన దానికీ కాని దానికీ ఇతనిని ఆడిపోసుకుంటు న్నారు.

నార్త్ ప్రభువు ఇదివరకెన్ని తడ వలో తన రాజీనామా పత్రము రాజుకి అందించాడు. మళ్ళీ రాజీనామాతో ప్రత్యక్షమయాడు రాజుముందు. ఇటు వంటి విప్లవ సమయంలో తనకంటే సమర్ధుడూ శక్తిమంతుడూ ప్రధానిగా వుండాలనీ, శతమొండి అయిన రాజుని వొంచగలిగితే తప్ప పరిస్థితులు తారు మారవుతాయనీ నార్త్ ప్రభువుకి భయము. భవిష్యత్‌లో తనకు అవ మానము, దేశానికి అప్రతిష్ఠా తప్ప మరొక మంచి ఏమీ కనబడటంలేదు. ఈ మూడవ జార్జి అమిత అహంభావి, పరమ మూర్ఖుడు, తనకి విముక్తి ప్రసాదించమని మొరబెట్టుకుంటున్న నార్త్ ప్రభువుని ప్రధాన మంత్రిత్వము నుంచి తప్పించడానికి అంగీకరించని తంత్రజ్ఞుడు మూడవ జార్జి.

దేశంలో జరుగుతున్న యుద్ధ ప్రయత్నాలు ప్రజా క్షేమానికి హాని కరమని ప్రధాన మంత్రికి తెలుసు. కాని రాజకీయంగా జాన్‌విల్కిన్ తప్ప మరెవరూ దీని గురించి అట్టే మాట్లాడ లేదు. రాజహితైషులతో నిండిన పార్ల మెంటు రెండు సభలవారూ వలసలస దండనీతిలో దారికి తీసుకొని రావా లనే అభిప్రాయంతో వున్నారు వ్యాపారస్థులూ పరిశ్రమదారులూ తమ వలస వ్యాపారము ఎక్కడ దెబ్బతిం టుందోనని ఆందోళన చెందారు. కాని రష్యా, టర్కీ, స్పెయిన్, మధ్య ప్రాచ్యాలతో వ్యాపారము ఉధృతమై యుద్ధ మేఘాలు కొంచెము కనపడ గానే వారు తెప్పరిల్లారు. ఇంగ్లండు లోని గ్రామీణులు రాజ వాక్యాన్ని పాలించడమే తమ కర్తవ్యమని భావిం చసాగారు. పారిశ్రామిక విప్లవానం తరపు లండన్ కార్మికులు, రాజ శాస నం పాటిస్తూ తమ దేశభక్తిని వెల్ల డించుకునేందుకు సిద్ధంగా వున్నారు.

కాని నార్త్ ప్రభువు క్లిష్టసమస్య ఏమిటంటే, తగినంత మంది సైనికు లనీ నావికులనీ ఎక్కడనుంచి తీసుకు రావడమని ! ఇంగ్లండులోని సామాన్య ప్రజానీకానికి రాజుగారి పట్ల రాజభక్తి అయితే వుందిగాని అమెరికాతో జరుప గల యుద్ధానికి సమకూర్చగల అంగ బలములేదు. అందువల్ల బయట దేశాల నుంచి కిరాయి సైనికులను చేర్చుకో వలసిన అవసరము ఏర్పడింది. సైని కులను సమకూర్చే నిమిత్తము మూడవ జార్జి తన ఏజంట్లను యూరప్‌లోని వివిధదేశాలకి పంపాడు. హాలెండ్ రష్యా దేశాలు తమ దేశాలనుంచి సైనికులెవరూ రారని మొదట్లోనే స్పష్ట పరిచాయి. కాని ధనాపేక్ష గల జర్మనీ లోని సామంత రాజులు, తమ రక్త బంధువూ వంశాబ్ధి చంద్రుడూ అయిన

మూడవ జార్జికి సహాయపడే నిమిత్తము ధనాతురతవల్లసైనికులని అమ్మేందుకు సిద్ధపడ్డారు. ఈ కిరాయి సైనికులతో ఆంగ్లసేనలు అమెరికా మీదకు వస్తున్నాయి. తిరుగుబాటుదార్లని అణివివేసి, అమెరికాను ఆంగ్లరాజు హస్తగతము చేయగలమనే తలంపుతో వస్తున్నాయి.

అమెరికా వలసలకి బ్రిటీష్ పార్లమెంటులో మిత్రులు లేకపోలేదు. ఎడ్మండ్ బర్క్ పలుకులు నార్త్ ప్రభువు మరువలేకుండా వున్నాడు; చెవులలో ఇంకా గింగురుమంటూనే వున్నాయి.

'ఆంగ్ల వలసలలోని ప్రజల స్వాతంత్ర్యాను రక్తిలో అమెరికా స్వాతంత్ర్య కాంక్ష అతి తీవ్రతర మైనది. వారు తమకు స్వపరిపాలన కావాలని అంటున్నపుడు, సామ్రాజ్యాధినేత, వారి ప్రతిపలుకూ శాసనధిక్కారంగా భావించడము అజ్ఞానమూ అవివేకమూ అనిపించుకుంటుంది. రాజకీయాలలో ఔదార్యమూ సహనమూ అతి ముఖ్యములు. సామ్రాజ్య పాలకుడు నిరుపమ గుణశీలుడూ మహెూదారుడు, సహనమంతుడూ అవ్వాలే తప్ప, అల్పమనస్కులూ స్వల్పబుద్ధులూ భూభారాన్ని మోయలేరు'

రాజాజ్ఞ ప్రకారము నార్త్ ప్రభువు వలసలను పాదాక్రాంతం చేయాలనే బిల్లు ప్రవేశ పెట్టినపుడు ఛార్లెస్‌ఫాక్సు ఇలా అన్నాడు: 'అమెరికనులచేత దాసోహమనిపించాలనే తలంపుతో క్రూరమూ అమానుషమూ అగు శాసనాలు ప్రవేశ పెట్టి వారు వీటిని పాటించలేదనీ, తత్కారణంగా తిరుగుబాటు దారులనీ అంటున్నారు. ఆ మాట మీరే అని, అనుకొని మీ నౌకలనూ, సేనలనూ వారిపైకి పంపి, వోటమి అంగీకరించమంటున్నారు. కాని మీరు ఈ చట్టాలని ఇంకొంచెం న్యాయ సమ్మతంగా, నీతి బద్ధముగా నిర్మించి వుంటే, వారు మీకు తిరుగుబాటుదార్లవలె కనిపించివుండరు.

రిచ్‌మండ్ ప్రభువు ఇలా సూటిగా అన్నాడు: 'అమెరికా ప్రజలు తిరుగుబాటు జరుపుతున్నారని నేను ఎంతమాత్రమూ భావించను. అతి దారుణమూ, అమానుషకరమూ అగు శాసనాలని వారు ప్రతిఘటిస్తున్నారు'.

వయోవృద్ధుడైనప్పటికీ మేధాసంపదలో అసమానుడైన విలియమ్ పిట్ ఇలా అన్నాడు: "ఈ నిద్రాణ మంత్రివర్గాన్ని, వారి నిర్బాధ్యతాయుత ప్రవర్తనకు ఒక్క తన్ను తన్ని, మీరు ఎంతటి ప్రమాదవస్థలో వున్నారో తెలుసుకోండయ్యా, అని హెచ్చరిక చెప్పాలని వున్నది. బాస్టన్‌లో జరిపిన ఘాతుకాలు క్షంతవ్యములు కావు. అక్కడి ప్రజానీకాన్ని అవమానపరచి, వారిని రెచ్చగొట్టారు. ఈరోజు వారిని నిర్హేతుకంగా తూలనాడుతున్నారు. వారిని అణిచి వేస్తామంటున్నారు. మూర్ఖులారా, ఒక ప్రజను అణిచివేయ గలరా ?' (ఇంకా వుంది

**మాతృక : కార్నెల్ లెన్‌గ్వేల్**

**తెలుగు : యవ్వార్ చందూర్**


నాణ్యత మా తయారీ! ఖ్యాతి తెచ్చినది భారత ప్రజలు!!
త్రివేణి
కోట్లాది ప్రజలు కోరుకునే
సుగంధ వక్కపొడి
TRIVENI
SUGANDH SUPARI
Pride of India
Choice of Millions
త్రివేణి నట్ పౌడర్ మాన్యుఫాక్చరింగ్ కో.,
మచిలీపట్నం-521 001.



సంప్రదాయం

# మన సంగీతం

## పి. సంగీతరావు

భారతీయ సంగీతం అతి ప్రాచీన చరిత్ర కలది. అది శ్రవణా నందాకరమైనది మాత్రమే కాదు - హృదయాన్ని పరవశింపజేసే కళ, బుద్ధిని ఉద్దీపింపజేసే శాస్త్రం, ఆత్మోన్నతిని కలిగించే విద్య - అంటారు సంగీతరావు. మన సంగీతంలో ఏకముఖగాత్రం ప్రధానం; పాశ్చాత్య సంగీతంలో బహుముఖ వాద్యానికి ప్రాముఖ్యత.

"కర్ణాటక శాస్త్రీయ గాత్ర సంగీతము ఎందుకో అనుభవించలేక పోతున్నాను. ఆడవాళ్ళు పాడుతున్నప్పుడు కొంత బాగానే ఉంటుంది. వాద్య సంగీతం అంటే వీణా, వైలెన్, మురళి, నాదస్వరం వింటున్నపుడు మాత్రం చాలా ఆనందంగా ఉంటుంది," అన్నారు యీమధ్య మిత్రులు ఒకరు. కొంతమంది అంటుంటారు: "హిందూస్థానీ సంగీతంలో ఎంతో హాయి ఉంది. కర్ణాటక సంగీతం అంతా శాస్త్రమే. మాకు అర్థం కాదు." - "సంగీతం అంటే శిశుబాల వృద్ధులనీ, పండిత పామరులనీ, పశు పక్ష్యాదులనీ కూడా ఆనందింపజేయగలిగి ఉండాలి. హాయి లేకపోయిన తర్వాత ఎంత శాస్త్రీయమైతే ఏం లాభం." ఇది కొందరి నిర్వచనం. శాస్త్రీయ సంగీతాభిమానుల దృష్టిలో అత్యధిక జనాదరణ పొందుతున్న సినిమా సంగీతం సంప్రదాయ రహితమైన వట్టిగోల మాత్రమే. దాక్షిణాత్యులు పాడేటప్పుడు భాష ఖూనీ అయిపోతుంది. అందుచేత సంగీతాన్ని అనుభవించలేక పోతున్నారట కొందరు. కొంతమందికి వారు అలవాటు పడిన సంగీతం తప్పించి ఏ విదేశీ సంగీతం విన్నా హాస్యాస్పదంగానే ఉంటుంది. పాశ్చాత్య సంగీతము శుద్ధ అపస్వరాలుగా వినిపిస్తుందట. కొంతమంది అనగా విన్నాము.

ఒకాయన గొప్ప వయాకరణి. ఆయన అంటూండేవారు. "ఎందుకు సంగీతం అంటే వీళ్ళంతా యిలా పడిచస్తారు. ఆ శంకరాభరణం అన్నా, తోడి అన్నా ఒక్కలాగే వినిపిస్తాయి నాకు."

సంగీత విషయములో ఈ విధమైన అసంతృప్తికరమైన మాటలు వినిపిస్తూ ఉంటాయి.

దీనిని బట్టి ఒక్క విషయము స్పష్టమవుతుంది. సంగీతము వినడములో ఆనందం ఉంది - అనే విషయములో సందేహము లేదు. కాని వేరు వేరు సంగీత సంప్రదాయ రూపాలను ఆనందించే విషయంలో భిన్న భిన్న అభిరుచులూ, అవరోధాలు ఉన్నట్లు అనిపిస్తుంది. ఇక ఎవరైనా సంగీతం అర్థం కాదు. అన్నా, ఆ మాటని 'ఆనందం పొందలేదు' అన్నట్టుగా అనుకోనక్కర లేదు. వారి ఆ సంగీతానందాన్ని పారిభాషికముగా చెప్పలేక పోతున్నారని మాత్రమే అనుకొనవలసి ఉంటుంది.

కళలని ఆనందించే సందర్భంలో కళాకారునికి ఎంత బాధ్యత ఉందో అనుభవించే వ్యక్తికి గూడా అంత రసజ్ఞత అవసరం. ఈ రసజ్ఞత కూడా ఎంతో సానుభూతితో పరిశీలనతో అవగాహనతో పెంపొందించుకొనవలసి ఉంటుంది. రసజ్ఞత అభివృద్ధి అయినకొద్దీ వివిధ సంగీత విధావాలలోని ప్రత్యేకత గుర్తింపబడి వాటిని ఆనందించే దృక్పథం ఏర్పడుతుంది. అంతే కాదు. వాటి పరిమితులు తారతమ్యాలు కూడా అర్థం అవుతాయి.

తరతరాల కఠోర సాధనతో, ప్రయోగములతో ప్రజల ఆనందాన్ని ఆధారం చేసుకొని పరిణామం చెందుతూ ఉంది సంగీత శాస్త్రం.

శృతి లయలు సంగీతానికి ప్రాణాలు. నిర్దిష్టమైన శృతి లయలతో కూడినప్పుడు ఏ సంగీత సంప్రదాయమైనా శ్రవణయోగ్యమైనదే. ఈ శృతి లయల ప్రయోగ సరళిని బట్టి వివిధ సంగీత సంప్రదాయాలు ఏర్పడుతున్నాయి.

శృతిని అధారం చేసుకొని శాస్త్రీయమైన అవగాహనతో స్వరభేధములు స్థాయిభేధములు గుర్తింప బడ్డాయి. స్వరముల పరస్పర సంబంధము వాది, సంవాది, వివాది రూపములుగా అర్థం చేసుకోబడ్డాయి. స్వరముల మూర్ఛనాది భేదములతో వివిధ రాగముల ప్రస్తారం జరిగింది. స్వర సౌందర్యాన్ని యినుమడింప జేయడానికి అనువైన వివిధ గమకములు ప్రయోగింప బడ్డాయి.

లయని అర్థం చేసుకొనడంలో వివిధ గమకములు, తాళములు అంతరమనముల పరిజ్ఞానం ఏర్పడింది. ఈ సౌందర్యాన్ని వివిధ తాళవాద్యముల ద్వారా ప్రదర్శించే శాస్త్రము ఎంతో అభివృద్ధి చెందింది.

ఈ శృతి లయల సమ్మేళనలో ఒక నాదప్రపంచమే సృష్టింపబడి మానవాత్మకు స్వాగతం పలుకుతున్నది.

రసనిష్యందియైన శృతి లయ సమ్మేళనకు భాష జతగూడినప్పుడు వివిధ భావరూపములైన కీర్తనలు ఏర్పడుతున్నాయి.

"నృత్యగీత వాద్యానాంత్రితయం గీత ముచ్యతే" సంగీత శబ్దానికి ఒక

సాటి నిర్వచనం యిది. తరవాత నృత్యము ప్రత్యేక శాఖగా అభివృద్ధి చెందింది. తరువాత భావరాగ తాళములు ప్రధానంగా సంగీతము పరిణామము చెందింది. చివరికి భాషతో సంబంధం లేకుండా స్వర రాగతాళములే సంగీతంగా రూపొం దించబడింది. నృత్యగీత వాద్యము లలో వేటికవి ప్రత్యేక సాధనారూపం గా అభివృద్ధిబొందినా యీ మూడింటి చేరిక చాల సహజమైనదే కాకుండా సంపూర్ణమైన కళగా ఆనందించబడు తుంది.

ఇక భావరాగ తాళముల చేరిక కేవల సంగీతముగానూ స్వరరాగ తాళముల చేరిక వాద్యసంగీతంగానూ సాధన చేయబడినట్టు గ్రహించగలం.

అయితే భారతీయ సంగీతము మానవ కంఠస్వరాన్నే అభివ్యక్తికి ప్రధాన ఉపకరణంగా తీసుకొంది. వాద్యసంగీతము గాత్ర సంగీతానికి దోహదప్రాయముగా మాత్రమే ఉప యోగించుకోబడింది. కేవల వాద్య సం గీతము ప్రదర్శించినా ఆ సంగీతము గాత్ర సంగీత ఆధారం మీద సృష్టింప బడిందే. భారతీయ తత్వసాధన వలెనే భారతీయ సంగీతము కూడా వ్యక్తిసాధనే. ఆ కారణం చేతనే ఏక ముఖమైన గాత్ర సంగీతానికి అనుగుణ ముగా రాగ విధానము ఏర్పడింది. రాగతాళములకు భాష జోడించడంతో వివిధ సంగీత రచనలు అవిర్భవిం చాయి. వివిధవాగ్గేయకారుల సుప్రసిద్ధ సంగీత రచనలన్నీ గాత్ర సంగీతానికి ఉద్దేశింపబడ్డవే కాని వాద్యసంగీతము కోసం ప్రత్యేకించి సృష్టింపబడ్డవి కావనే చెప్పవచ్చును.

అయితే భారతీయ సంగీతానికి ఆత్మ అనదగిన రాగ భావాన్ని వ్యక్తంచేయడానికి సమర్థమైన వాద్య ములకు మాత్రమే భారతీయ సంగీత ములో విశిష్టమైన స్థానము యేర్ప డింది. వీణ, వేణువు, నాదస్వరము, ఉత్తరదేశ వాద్యములైన సితార్, సారంగి, సహనాయ్ వాద్యముల ప్రాముఖ్యత అయా వాద్యములు రాగ వ్యక్తీకరణకి అనుకూల్యము కలిగి ఉండడముచేతనే! పాశ్చాత్య వాద్య ములు ఎన్నో ఉన్నా భారతీయసంగీతా నికి ముఖ్యంగా కర్ణాటక సంగీత ప్రదర్శనలో అధిక ప్రచారం పొందిన వయొలిన్ వాద్యానికి యింతటి ప్రాము ఖ్యం కలగడానికి కారణం రాగవ్యక్తీ కరణకి వయొలిన్ మిక్కిలి అనుకూల ముగా ఉండడం వలననే. అయితే రాగవిధానము గాత్ర సంగీతానికి అనుకూల్యముగా సృష్టింపబడ్డదనే విషయం మరచిపోకూడదు.

భారతీయ సంగీతంలో ఏకముఖ గాత్ర సంగీతగాయకుడు తీసుకొనిన శ్రద్ధాసక్తులే పాశ్చాత్య సంగీతంలో బహుముఖ వాద్యసంగీతానికి తీసు కొనడము వలన పాశ్చాత్య సంగీత విధానములో ఆర్కెస్ట్రా అంత ప్రాము ఖ్యత కలిగి వుంది.

ఏకముఖమైన గాత్ర సంగీతంలో నాద సౌందర్యాన్ని యిమడింప చేయడమే కాకుండా రసభావములు

వక్తీకరణకి గమకముల ప్రాధాన్యత ఎంత ఉందో బహుముఖమైన వాద్య సంగీతములో సర్వసౌందర్యానికి రస భావ వక్తీకరణకి వాది, సంవాది, వివాది స్వర ప్రయోగాలలో అంతటి హెఛ్చత్వాన్ని సంతరించుకొంది. ఆ కారణంచేతనే పాశ్చాత్య సంగీతములో వాద్యసంగీతంలో వాద్య సంగీతాను గుణ్యమైన సంగీత రచనలు చేయ బడ్డాయి.

స్వరరాగ తాళ ప్రదర్శనకీ, గమన స్ఫూర్తికి మానవ కంఠస్వరం ఎంతో సమర్థమైనదైనా భాషా సహిత మైనప్పుడున్నంత రంజన కేవల రాగ తాళ ప్రయోగములో ఉండదు. వాద్య సంగీతానికి లేని గొప్పవరం సంగీతా నికి ఈ భాష అనే చెప్పవచ్చును. రసభావ వ్యక్తీకరణకి సంగీతంలో భాష ఎంతో సౌకర్యాన్ని కలిగి స్తుంది. అంత మాత్రమే కాదు. పదముల ఉచ్చారణ సంగీతానికి మిక్కిలి సౌందర్యాన్ని కలిగిస్తుంది. ఆ యీ కారణాలవల్ల సంగీతములో భాష చాలా ప్రధానమైన స్థానాన్ని పొందింది. సంగీతములో భాషా ప్రాబల్యం ఎంతవరకూ వచ్చిందంటే సంగీతానికి ఆత్మ అనదగిన రాగ తాళములు గాత్ర సంగీతములో అప్రధాన విషయాలుగా పరిగణించే స్థితికి వచ్చింది. అయితే నిజమైన సంగీత రసా స్వాదనకి భాషావరోధం ఎంత మాత్రము ఉండదు. కాక పోయిన పక్షంలో భాషాభేదంతో యితర భాషా సంగీతాన్ని ఆనందించే అవకాశమే లేకపోయి ఉండును.

ఏమైనా భాషా సహితమైన సంగీ తానికి ఉండే అంత ఆదరణ మన దేశంలో కేవల సంగీతానికి ఏర్పడ లేదు. స్వల్పమైన రాగతాళ పరిజ్ఞాన ముతో కూడా ఒక పాట పాడి గాయకుడు రసస్ఫూర్తి కలిగించ గలుగుతున్నాడు. అయితే నిజమైన రసానుభూతికి స్వరరాగ తాళముల శాస్త్రీయ పరిజ్ఞానము ఎంతో అవసరము.

వివిధ సంగీతరూపాలను ఆనం దించడానికి వాటివాటి పరిమితులను అవకాశములను అర్థము చేసుకోవ డము మంచిది. ఉదాహరణకు బుర్ర కథ అనేకులు ఆనందించడం చూస్తా ము అయితే ఆ విధానములో పరిమిత మైన రాగతాళములు భాషకి జోడింప బడి కథరూపంగా ప్రదర్శించ బడు తుంది బుర్రకథలోని ఆకర్షణ ప్రధా నముగా. భాషకి, కథకి మాత్రమే సంబంధించినది. రాగతాళములు కేవ లము అంగములు మాత్రమే. అక్కడ అధికమైన నాదానుభూతిని ఆశించ లేము. అదే విధముగా నాటకాలలో పద్యపఠనము బహు జనామోదాన్ని పొందుతూఉంది. అక్కడ తాళ ప్రాధా న్యత ఏ మాత్రమూ లేదు. రాగము పద్య పఠనానికి అనుకూలముగా అనుసంధానము చేయబడింది.

ముఖ్యముగా జానపదుల సంగీత ములో రాగతాళములు అతి పరిమిత

మైన పద్ధతిలో మాత్రమే ప్రయో గింపబడతాయి. వాటిలో ఆకర్షణ పూర్తిగా నాదానుభవానికి చెందింది కాదు.

అదేవిధంగా వివిధ గేయరచన నలకు సమకూర్చబడిన సంగీతము భిన్నమైన తారతమ్యములతో కూడి నదై ఉంది. ఈ విషయములో నాట్య ప్రదర్శనలో సంగీత ప్రయోగము వింటే యింకా స్పష్టపడుతుంది. నృత్యమునకు అవసరమైన ఆగమనా నికి ఉండే ప్రాధాన్యత సంగీతానికి ఉండదు. ఏదో ఒక పాట చరణం ఒకే పద్ధతిలో వందసార్లు పునశ్చరణ చేస్తుంటే, భావవ్యక్తీకరణం నాట్యం ద్వారా జరుగుతుంది. చిరకాలంగా దేశంలో వ్యాప్తి చెందిన అష్టపదులు, తరంగాలు, అధ్యాత్మిక రామాయణ కీర్తనలు, భజన కీర్తనలు, జానపదు లలో ప్రచారం చెందిన ఊడుపుల పాటలు, నూర్పుల పాటలు, పడవ పాటలు, మంగళహారతులు వాటి అన్నిటిలోనూ సాహిత్య ప్రయోజనానికి మాత్రమే రాగతాళములు ప్రయో గింపబడుతున్నాయి.

అయితే కర్ణాటక శాస్త్రీయ సంగీత సాంప్రదాయములో సంగీత సాహిత్య ములు సమన్వయములో మరొక విధానం అనుసరించబడినది.

వివిధ వాగ్గేయకారులచే రచింప బడిన రచనలలోని సాహిత్యము సంగీతానికి అనగా రాగభావాన్ని అను సరించి జోడించబడింది. గీతములు, స్వరజతులు, వర్ణములు, కృతులు ఈవిధమైన సంగీత సాహిత్య సమన్వయం జరిగింది.

గీత గ్రంథములో రాగ సంచా రాన్ని తెలియజేసే సర్వముల నను సరించి సాహిత్యం నడుస్తుంది. అంత కన్న స్వరజతులలో గమనవేగము చేత, పదముల స్వరూపం అర్థం అయేటట్టుగా ఉంటుంది. ఇక వర్ణ గ్రంథములో సాహిత్యం నామమాత్ర ముగా ఉంటుంది. అకార ఇకార ఉకా రములు రాగసంచారము ఉపయో గించు కొందుకి మాత్రమే సాహిత్యము ఉపయోగింపబడింది.

సంగీత సాహిత్య ప్రయోగ సరళిలో శ్రీ త్యాగరాజ స్వామివారు చేసిన ప్రయోగాలు వివిధ మార్గాలలో ఉన్నాయి. కవిత్వమూ, అలంకారిక మైన భాషా భావ పుష్టి రసపుష్టి ఎంత ఉన్నా శ్రీ వారి కీర్తనలలో సంగీత మర్యాదననుసరించి రాగతాళముల సౌందర్యాన్ని మాత్రమే ఉజ్వల పరుస్తూ సాహిత్యము ఒదిగి ఉంటుంది.

సంగీతము యెడల ప్రత్యేకమైన మమకారము లేని రసజ్ఞులు, సాహిత్య రూపంలో శబ్ద అర్థ సౌందర్యం కలిగిన ఆయాకీర్తనలను మహాభక్తుడైన త్యాగ రాజస్వామి అలా పాడి ఉండరనీ తరవాతి విద్వాంసులు వాటి స్వరూ పాన్ని మార్చి ఉంటారనీ అనుమా నిస్తారు. ఒకటి మాత్రం అనుకో వచ్చును.

కీర్తనలోని రాగ భావానికి అను గుణమైన సంగతులలో మార్పులు

చేర్పులు జరిగివుండవచ్చును. కాని అసలు మూలరచన సంగీతశాస్త్ర మర్యాదననుసరించి మాత్రమే జరిగిందనేది నిశ్చయము. ఆ కీర్తనల లోని సాహిత్యము విడిగా తీసి చూసినప్పుడు, ఆ సాహిత్యములో సహజమైన నడక ఉండదు. కీర్తన స్వరూపముతో పాడినప్పుడు మాత్రమే యతి ప్రాసలు తాళబద్ధముగా ఏర్పడినట్లు స్పష్టపడుతుంది. అసలు సమస్య సంగీత సాహిత్యములకు సంబంధించినది కాదు. ఆ మహామహుడు సంగీత సాహిత్యాలను రెండింటినీ సమన్వయపరిచి భక్తిరసస్ఫూర్తిగా గానం చేశారు.

నేడు కచ్చేరీలలో కీర్తన గానం చేయబడినప్పుడు రాగతాళముల యెడల కలిగిన శ్రద్ధాసక్తులు రస పోషణ విషయములో ఉన్నట్లు గోచరించదు. రసదృష్టిలోని సంగీతములో మధురస్వర సమ్మేళన గలిగిన రాగములు, గమనములు కూడా ఎంతో నిష్ఠురంగానూ, శుష్కముగానూ ప్రదర్శింపబడతాయి. రసిక లోకంలోనూ, ప్రజాసామాన్యము లోనూ కూడా శాస్త్రీయ సంగీతం పేరుగా వినబడుతున్న సంగీతము యెడల క్రమక్రమముగా ఔదాసీన్యాన్ని పొందబడడానికి ఇటువంటి హేతువులు మరి కొన్ని కూడా వుండవచ్చును. అయితే రాగతాళ ప్రయోగములో వారి సాధన, నిష్ఠ ప్రశంసనీయమైనవి.

రాగములలో రసనిర్దేశం జరిగింది కానీ మనకు శాస్త్రీయ సంగీత కచ్చేరీలలో వినబడేవి భక్తిశృంగార కీర్తనలు మాత్రమే. నాట్యములోనూ, నాటక ప్రయోగంలోనూ వివిధ రస పోషణకు అనుగుణ్యమైన కీర్తనలు గానము చేయబడుతున్నాయి.

భారతీయ సంగీతము అంతా ఒకే పునాదిమీద నిర్మింపబడినా శైలి భేదాన్ని బట్టి వివిధ సంప్రదాయాలుగా ఏర్పడ్డాయి. ప్రధానంగా హిందూస్థానీ, కర్ణాటక సంప్రదాయాలను పేర్కొనవచ్చును. సంగీతానికి చెందినంత వరకూ ఈ రెండు సంప్రదాయాలలోనూ గమక ప్రయోగములో రెండూ రెండు విశిష్టమైన మార్గాల ననుసరించాయి. ఒకే ఆరోహణ అవరోహణ గలిగిన రాగాన్ని ఆలపించడంలో హిందూస్థానీ, కర్ణాటక సంగీతముల బాణీల ప్రత్యేకత స్పష్టపడుతుంది. హిందూస్థానీ రాగసంచారంలో శృతి పక్వత అధికం. కర్ణాటకరాగ సంచారంలో భావదృష్టి ఎక్కువ.

అయితే కర్ణాటక రాగ భావ ప్రకటనకి అనుసరిస్తున్న గమక విధానం అతి కష్టసాధ్యమైనది. సాధ్యమైనప్పటికీ సౌందర్యాన్ని స్ఫురింప చేయడానికి ఎంతో సహజ సిద్ధమైన సుస్వరమూ, గమక యుక్తమైన సుశారీరమూ కలవారికి మాత్రమే సాధ్యము. మామూలు మాటలలో చెప్పుకోవాలంటే హిందుస్థానీ సంగీత గమకము తిన్నగా నడుస్తుంది. కర్ణాటక సంగీత గమకం మెలికలు తిరుగుతుంది. ఒకటి తీగ పాకం అయితే రెండవది జీళ్ళపాకము.

సుశారీరము అంటే ఏమిటి? - అన్న దానికి స్పష్టమైన సమాధానము సంతృప్తిగా చెప్పడం కష్టము. స్వరశుద్ధి గమక స్ఫూర్తిగా త్రిస్థాయి గల శారీరము సుశారీరము అని స్థూలంగా చెప్పుకొన్నా పై లక్షణాలు కలిగి అహితముగా ఉండే గాత్రాలున్నాయి. ఒకప్పుడు బస్సుహారన్ శృతిలో కలుస్తుంది. అంత మాత్రాన అది సంగీత ధ్వని అనుకోలేం. సౌందర్యము అంటే ఏమిటి అని అడిగితే నిర్వచించడం లాటిదే సుశారీరం అంటే చెప్పడం కూడా. ఈ విషయము చెప్పడంలో తికమక ఉన్నా అనుభవములో చాలా సులువుగా తెలుస్తుంది.

గాయకులు తమ కంఠస్వరానికి అనుకూలమైన గమకముల ప్రయోగిస్తూ రసదృష్టితో గానము చేయడము అవసరము. లేకపోతే ఆ గాయకుని సంగీతము, ఏదో విపరీతము సాధించబడింది అనే తృప్తి తప్పించి, హృదయాన్ని స్పృశించదు - ఏనుగుని రెండు కాళ్ళ మీద నిలబెట్టినట్టో, లేకపోతే కోతిచేత నాట్యం చేయించినట్టో తయారవుతుంది.

ప్రస్తుతం సంగీత కచ్చేరీలలో గాత్ర సంగీతము వింటునప్పుడు ఒకటి అనిపిస్తుంది. మానవ కంఠస్వరము తన సహజ మార్గాన్ని విడిచి పెట్టి వాద్య సంగీతాన్ని అనుసరిస్తున్నదా అనే అనుమానం కలుగుతుంది.

రాగభావం గాత్ర సంగీతానికి అనుకూలంగా ఏర్పడినప్పటికీ వాద్య సంగీతంలో ఒక్కొక్క వాద్యానికి ఒక్కొక్క విధమైన గమక ప్రాధాన్యత ఉంది. ఆయావాద్య ధర్మాన్ననుసరించి రాగసంచారం కావింప బడుతుంది. కాలక్రమేణా ఆయావాద్యముల ప్రత్యేక గమక ప్రాధాన్యత గల సంచారాన్ని గాత్రంలో పలికించాలనే తాపత్రయం వలన గాత్ర సంగీతంలో సహజ స్వర మాధుర్యం పోయి ఏదో విపరీత లక్షణము గోచరము అవుతూ ఉంది. ఉత్తరాది గాయకులలో ఈ లక్షణం కనబడదు. ముఖ్యముగా దాక్షిణాత్య సంగీతంలో వీణ నాదస్వరముల ప్రభావం గాత్రంలో కనిపిస్తుంది. గాత్ర సంగీతం తన సహజమార్గాన్ని వదిలి, సాహిత్యాన్ని సక్రమముగా వినియోగించుకొనక, రసదృష్టికి దూరం అయినంత కాలము ఆ సంగీతం ఎన్ని విపరీతాలు సాధించినా రసహృదయాలని కదిలించలేదు. రసికులు కూడా ఆయా సంగ్గీతం రూపాలు ఉద్దేశించిన కళాస్వరూపాన్ని సానుభూతితో గహించనప్పుడు అనవసరమైన శంకలు మాత్రమే మిగిలి సంగీతానందానికి దూరం అయే ప్రమాదము ఉంది.

భారతీయ సంగీతం అతి ప్రాచీన చరిత్ర కలది. అది శ్రవణానందకరమైనది మాత్రమే కాదు. హృదయాన్ని పరవశింపజేసే కళ. బుద్ధిని ఉద్దీపింపజేసే శాస్త్రం, ఆత్మోన్నతిని కలిగించే విద్య అనే విషయం రసికులు జ్ఞప్తిలో ఉంచుకొనడం అవసరం. ☀

—1967 జనవరి 'జగతి' నుంచి పునర్ముద్రితం

# మాలతీ చందూర్

## నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16 - 50 |
| కాంచన మృగం | 16 - 50 |
| భూమి పుత్రి | 16 - 00 |
| మధుర స్మృతులు | 14 - 00 |
| ఓ మనిషి కథ | 16 - 00 |
| ఏమిటీ జీవితాలు | 12 - 00 |
| మనసులోని మనసు | 25 - 00 |
| ఆలోచించు | 9 - 00 |
| రాగరక్తిమ | 18 - 00 |
| మేఘాల మేలిముసుగు | 16 - 00 |
| కలల వెలుగు | 15 - 00 |
| బ్రతకనేర్చిన జాణ | 14 - 00 |
| జయలక్ష్మి | 20 - 00 |
| కృష్ణవేణి | 20 - 00 |
| ఏది గమ్యం ఏది మార్గం | 15 - 00 |
| ఎన్ని మెట్లెక్కినా.... | 18 - 00 |
| సద్యోగం | 15 - 00 |
| లావణ్య | 14 - 00 |

## ఇవిగాక

| | |
|---|---|
| వంటలు - పిండివంటలు | 35 - 00 |
| ప్రశ్నలు - జవాబులు | 15 - 00 |
| జాబులు - జవాబులు | 13 - 00 |
| అల్లికలు - కుట్లు | 30 - 00 |
| అందాలు - అలంకారాలు | 15 - 00 |
| మహిళలకు మధురజీవనం | 7 - 50 |
| దాంపత్య జీవితం | 12 - 50 |

20/- రూ॥ పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు. ముందుగా ఆ పుస్తకాలధరకు 2 రూ॥ తగ్గించి M. O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V.P.P. పంపుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.

**క్వాలిటీ పబ్లిషర్స్**

**రామమందిరం వీధి - విజయవాడ - 2**

స్నేహ పరిమళం

# ఆనాటి మిత్రుడు

## సంజీవదేవ్



వేదనా హృదయంతో, చెమ్మగిల్లిన కళ్ళతో ఆ ఉత్తరాన్ని ఎన్నిసార్లు చదివానో మళ్ళీ చదివాను. హృదయం ఎంతో బరువుగా వున్నది. క్రమేణ కాలం గడిచిన కొద్దీ ...కాని, ఏదో అస్పష్టమైన ఆశ అధోచేతనలో....

మిత్రుని పేరు త్సాన్‌యాంగ్, అయన జాతి టిబెటో చైనీయం.

పదమూడు సంవత్సరాల క్రిందట డార్జిలింగ్‌కు అవతలగా వున్న కలింపాంగ్‌లో వుండేవాడు.

ఈ దేశంలోనీ, విదేశాల్లోనీ ఇంగ్లీషు పత్రికలలో వ్యాసాలు వ్రాసేవాడు.

నాకు ఆయనా, ఆయనకు నేను ఉత్తరాలు వ్రాసుకొనేవాళ్ళం.

కలింపాంగ్ నుంచి అప్పుడు నడుస్తూన్న 'Himalayan Times' లో సాంస్కృతిక విషయాలమీద నేను చిన్న రచనలు చేస్తూండేవాడిని.

'Maha Bodhi' లోనూ, 'Eurasia' లోనూ త్సాన్‌యాంగ్ వ్యాసాలు వ్రాస్తూండేవాడు.

తన ఉత్తరాలలో నాకు హిమాలయ శోభను గురించి ఆయన వ్రాసేవాడు. నా ఉత్తరాలలో ఆయనకు దక్షిణాది మైదానాల శోభను గురించి నేను వ్రాసేవాణ్ణి.

ఇద్దరం కొంత కాలంపాటు నివాసాలు మార్చుకొందాం అని కూడా నిర్ణయించుకొన్నాం.

చలికాలంలో. ఆయన వచ్చి నా దగ్గర వుండేటట్లూ, ఎండాకాలంలో నేను వెళ్ళి ఆయన దగ్గర వుండేటట్లూ.

ఈ విధంగా నాకు అక్కడి వాతావరణం, ఆయనకు ఇక్కడి వాతావరణం అలవాటయిన తరువాత ఆయన ఇక్కడ ఆంధ్రలో మా ఇంటిని ఆక్రమించుకోటం, నేను అక్కడ హిమాలయాలలో ఆయన ఇంటిని ఆక్రమించుకోటం జరగాలని నిర్ణయం.

ఉభయులం కూడ పరస్పరంగా ఈ జీవన నియమాలను హృదయపూర్వకంగా ఆహ్వానించి అవి అమలు జరిగే ఘడియ కోసం నిరీక్షిస్తున్నాం అప్పుడు.

ఒక దుర్ముహూర్తాన కలింపాంగ్ నుంచి ఉత్తరం ; తనకు చాల పెద్ద జబ్బు చేసినదని త్సాన్‌యాంగ్

వ్రాశాడు. కలింపాంగ్ నుంచి టిబెట్ ముఖ్యపట్టణమైన లాసానగరానికి వెళ్ళి పోతున్నట్లూ తాను జీవించటం దుర్లభమనీ, తననుంచి అదే కడసారి ఉత్తరంగా భావించమని కూడ వ్రాశాడు. ఇంకా వ్రాశాడు: "నాకు జబ్బు చేసినందుకూ నేను మరణించ పోతూన్నందుకూ నేను బాధపడటం లేదు. కారణం మీకు జబ్బు చేయ లేదనీ, మీరు జీవించబోతున్నారనీ నాకెంతో ఆనందంగా వుంది. నా మరణ వార్త విన్న తరువాత కూడ మీరు శోకించకుండా ఉండటానికి ప్రయత్నిస్తే నా ఆత్మకు శాంతి లభిస్తుంది. నేను జన్మించటం భారత సరిహద్దుల లోనే అయినా మరణం మాత్రం టిబెట్‌లో జరగబోతూన్నందుకు కొంత విచారంగా, కొంత ఆనందంగా వుంది. మీ ఆనందం నా బాధను తొలగించాలే కాని, నా బాధ మీ ఆనందాన్ని తొలగించరాదు. జీవితం అంటే ఏమిటో ఇప్పటి వరకూ రుచి చూచాను. ఇక మరణం అంటే ఏమిటో రుచి చూడబోతున్నాను. రెంటిలో ఏది ఎక్కువ రుచికలదో మీకు నేను తెల పడం ఏవిధంగానా అని విచారిస్తు న్నాను. అశరీరవాణినై మీకు తెలపటానికే ప్రయత్నిస్తాను.'

త్రన మరణానికి నన్ను శోకించ వద్దని మిత్రుడు వ్రాశాడు కనుక శోకించకుండా ఉండటానికే ప్రయత్నించాను. లేక లోలోపల శోకించినా కూడా పైకి శోకించనట్లు నటించాను. ఆయన మరణించినట్లే నమ్మి ఊరకున్నాను.

కొన్ని నెలలకు టిబెట్టు మార్గం నుంచి మరొక ఉత్తరంరావటం చూచి ఆశ్చర్య పోయాను. త్సాన్‌యాంగ్ మళ్ళీ వ్రాశాడు. టిబెట్టు వెళ్ళేదారిలో నుంచి, క్రిందటి తడవ వ్రాసింది ఆఖరి ఉత్తరం కాదనీ, యీ తడవది మాత్రం నిజంగానే ఆఖరి ఉత్తరం అనీ, క్రిందటి తడవ తాను మరణించ లేక పోయాననీ, యీ తడవమాత్రం నిజంగానే మరణిస్తాననీ, ఇంకా వ్రాశాడు.

"మరణించటంలో నాకు వేరే బాధ ఏమీ లేదు కాని మిమ్ము చూడకుండా మరణిస్తూన్నానే అనేది పెద్ద బాధ. ఏమంటే నా రచనల్ని అమెరికాలో పుస్తకరూపంలో ప్రకటిస్తున్నారు. ఆ పుస్తకం ముద్రణ పూర్తి అయినదాకా జీవించి ఆ పుస్తకాన్ని చూచుకొన్న తరువాత మరణించాలని. సరే, ఈ రెండు బాధలూ తీరకముందే మరణిస్తే ఏమీ లేదు, మరచాను, నా రచనలు పుస్తకరూపంలో వస్తే చూడాలనే అభిలాషకంటే మీరచనలు పుస్తక రూపంలో కొస్తే చూడాలనే అభిలాష ఇంకా గొప్పగావుంది. నేను జీవించి ఉండగా మీరు అదయినా పూర్తి చేయలేక పోయారు. లేక మీ పుస్తకం పూర్తి అయేదాకా నేనయినా జీవించ లేక పోతున్నాను. నా శరీరంలో ప్రాణశక్తి రోజుకు రోజు దిగజారి పోతూంది. లాసానగరం చేరేదాకా జీవించననే: దారిలోనే నా సమాధి

నిర్మాణం జరగవచ్చు. అట్లా జరిగే పక్షంలో మీరేనాటికైనా లాసానగరం వస్తూంటే మార్గమధ్యంలో నా సమాధి వద్ద ఒకరాత్రి మజిలీచేసి నా సమాధి మీద చమరీ మృగం వెన్నతో దీపారాధన చేసిపొండి, సరే, ఇక వ్రాయలేను. మీ కిదే అంతిమ...."

... వేదనాహృదయంతో, చెమ్మగిల్లిన కళ్ళతో ఆ ఉత్తరాన్ని ఎన్నిసార్లు చదివానో! అంతకు క్రిందటి ఉత్తరాన్ని కూడా తీసి మళ్ళీమళ్ళీ చదవాను. కొనాళ్ళవరకూ హృదయం ఎంతో బరువుగా వున్నది. క్రమేణ కాలం గడిచిన కొద్దీ బరువనేది తేలికలోకి మారిపోజొచ్చింది. ప్రతిదినమూ కొన్నిసార్లు జ్ఞాపకం రాసాగడు, అధో చేతనలో మాత్రం మళ్ళీ ఎప్పుడో ఆయన నుంచి ఉత్తరం వస్తుందనే ఏదో అస్పష్టమైన ఆశ దాగి వుండేది.

సంవత్సరం గడిచింది. త్వాన్ యాంగ్ నుంచి ఉత్తరం లేదు. కలింపాంగ్‌లోని మిత్రులకు వ్రాసి చూచాను. వారి జవాబులలో కూడ త్వాన్‌యాంగ్ మరణించినట్లే అని తెలిసేరు. ఇక త్వాన్‌యాంగ్ అశరీర రూపంలో మాత్రమే తన అస్తిత్వాన్ని కలిగివున్నాడని నిర్ధారణ చేసికొన్నాను.

మధ్య మధ్య ఆయన జ్ఞాపకం వచ్చినపుడల్లా ఆయన వ్రాసిన ఉత్తరాలను తీసి చదివి మౌనం దాల్చేవాడిని. ఆయన ఉత్తరాలలోని భావాలు ఎంతో సరళంగా అమాయికంగా, ప్రేమపూర్ణంగా వుండేవి. త్వాన్‌యాంగ్ బ్రతికుండగా వ్రాసిన ఉత్తరాలు ఆయన చనిపోయిన తరువాత చదువుతూంటే ఆయన బ్రతికి వున్నట్లే అనిపించక చనిపోయినట్లు అనిపిస్తుందా మరి! చనిపోయిన తరువాత వ్రాసినవయితే చనిపోయినట్లు తడుతుంది. చనిపోయి, తరువాత వ్రాయనే లేదుగా!

ఒక సంవత్సరం గడచి పోయింది. రెండు గడచి పోయినవి. మూడు, నాలుగు, అయిదు, ఆరు, ఏడు, ఎనిమిది సంవత్సరాలుగడచిపోయినవి. తొమ్మిది పది, పదకొండు, పన్నెండు సంవత్సరాలుగడచి, పదమూడోసంవత్సరంవచ్చింది. 1964 వ సంవత్సరం జనవరిలో, డిశంబర్ మాసపు 'United Asia' వచ్చింది. అందులో తెరచి చూస్తే త్వాన్‌యాంగ్ వ్రాసిన వ్యాసం 'Shape of things over Indian Skv' అనేది వుంది. పూర్వం త్వాన్‌యాంగ్ జీవించి వున్నప్పుడు వ్రాసిన వ్యాసాన్ని పత్రిక వాళ్ళు ఇప్పుడు ప్రకటించారు కాబోలు అని అనుకొన్నా. పత్రికలోని రచయితల్ని గురించి వ్రాసిన భాగం చదువుతూంటే యీ క్రింది పంక్తులు కనుపించి అంతులేని ఆశ్చర్యంలో మునిగిపోయినా!

Mr. Twan Yang, a freelance journalist and correspondent to many well known dailies and weeklies, permanently stationed at Gangtok, Sikkim. The article published in this issue is a chapter from Twan Yang's forth-coming book 'Wind from Tibet.'

(త్సాన్‌యాంగ్ సిక్కింరాజ్యంలోని గాంగ్‌టోక్‌లో వుంటూన్న స్వతంత్రంగా జీవించే ఒక పత్రికా రచయితా, విలేఖరి. ఆయన ఎన్నో ప్రసిద్ధి చెందిన దినపత్రికలకూ, వార పత్రికలకూ కూడ వ్రాస్తుంటాడు. ఈ పత్రికలో ప్రకటించిన వ్యాసం ఆయన రచించిన రాబోవు పుస్తకం 'Wind from Tibet' ('టిబెట్ మీది గాలి') అనే దానిలోని ఒక అధ్యాయం.

నా ఆశ్చర్యానికీ, ఆనందానికి హద్దులులేవు. చనిపోయిన మిత్రుడు పదమూడు సంవత్సరాలకు మళ్ళీ బ్రతికివచ్చి సిక్కిం రాజ్యంలో వుంటున్నాడన్నమాట! ఎంత ఆనందం! అంతా నాకో గొప్ప రహస్యమయంగా తోచసాగింది. అయితే చచ్చి బ్రతికిన మిత్రునితో తిరిగి మైత్రిని స్థాపించుకొని ఆయన మరణ విశేషాలను తెలుసుకోటం ఎట్లా? నా చిరునామా మరచిపోయి ఉంటాడు. నేను వెంటనే ఒక ఉత్తరం కేర్‌ఆఫ్ 'United Asia' చిరునామాతో వ్రాస్తే అది సిక్కిం వెళ్ళి నాకు జవాబు వచ్చే వరకు ఇరవై రోజులైంది. త్సాన్‌యాంగ్ నుంచి ఎంతో ప్రేమతో నిండిన పెద్ద ఉత్తరము వచ్చింది. అందులో ఆయన వ్రాస్తాడు :

"పదమూడు సంవత్సరాలనాడు మరణిస్తున్నానని తెలిపి చివరకు మరణించకుండా జీవించాను! అయితే చాలాకాలంవరకూ నేను జబ్బుతోనే బాధపడ్డాను. మిమ్మ్మ ఇంతకాలం మరచిపోలేదు. అయితే ఉత్తరం వ్రాయాలంటే మాత్రం ధైర్యం చాలేది కాదు. మీతో మరణిస్తున్నానని చెప్పి జీవించే ఉన్నానని మళ్ళీ మీకు తెలపటం అంటే గొప్ప అబద్ధం పలకటమే అవుతుంది. మీ ఎదుట నేను అసత్యవాదిగా ప్రత్యక్షం కావటం నాకిష్టం లేక మీకు ఇంతకాలం నుంచీ ఉత్తరం వ్రాసే సాహసం చేయలేక పోయినందుకు క్షమాయాచన. సిక్కిం రాజ్యంలో సుఖంగానే వుంటున్నాను. కొన్ని అమెరికన్ పత్రికలకు విలేఖరిగా ఉంటున్నాను. చాలామంది దృష్టిలో నేను మరణించి పునర్జీవించినట్లే. నాకూ ఒకోసారి అదే భ్రమ జనిస్తుంది. మన మైత్రి మళ్ళీ స్థాపితమైనందు కెంత ఆనందమో ...."

పదమూడు సంవత్సరాల క్రితం మరణించిన మిత్రుడు త్సాన్‌యాంగ్ మళ్ళీ జీవించి వచ్చాడు. ఆయన అనారోగ్యమంతా ఆ మరణంతోనే నశించిపోయి ఇప్పుడెంతో ఆరోగ్యంగా, ఆహ్లాదంగా సిక్కిం రాజ్యంలో హిమాలయ శోభ మధ్య హాయిగా జీవిస్తున్నాడు. ఒకసారి మరణించి వచ్చిన మిత్రుడు మళ్ళీ మరణించడేమో! మరణించి జీవించిన వాళ్ళు అమరులలో లెక్క. చచ్చి బ్రతికిన మిత్రుడు త్సాన్‌యాంగ్ అమరుడే!

**'తెలుగు విద్యార్థి' సౌజన్యంతో**
**1964 అక్టోబరు 'జగతి'**



సాంఘిక మార్పులు

# ప్రచార సాధనాల పాత్ర

## సరోజినీ ప్రేమ్‌చంద్

ఆంధ్రదేశంలో సంఘసంస్కరణకి పితామహుడు కందుకూరివీరేశలింగం గారు. తన చుట్టూవున్న సమాజంలోని లోటుపాట్లను సరిచేయాలనే వుద్దేశం కలుగగానే 1874లోనే 'వివేకవర్ధని' అనే మాసపత్రికను ఆరంభించారు. ఆ తర్వాత 'హాస్యసంజీవని' అనే పత్రిక, 1883లో స్త్రీలకై ప్రత్యేకంగా 'సతీహితబోధిని' స్థాపించారు. అంతకు కొద్దికాలంముందే పరవస్తు రంగాచార్యులు వితంతు వివాహాలను ప్రోత్సహిస్తూ కరపత్రం ఒకటి అచ్చువేశారు. అప్పటి సమాజంలోని అవినీతినీ మూఢాచారాలనీ విమర్శిస్తూ పత్రికల్లో వ్రాయడంవలన ఎన్నో కష్టనష్టాలకు లోనైనట్లు వీరేశలింగంగారు చెప్పుకున్నారు. "లంచగొండితనాన్ని యెత్తి చూపితే వుద్యోగులు నా మీద కత్తులు నూరుతున్నారు. వేశ్యా వృత్తిని ఖండిస్తే వూరిలోని జల్సారాయిళ్లు ఆగ్రహిస్తున్నారు. మూఢాచారాలను చెండాడితే విద్యా విహీనులైన మూర్ఖ ప్రజలు నొచ్చుకుంటున్నారు. పూజా పునస్కారాలు, మంత్రతంత్రాలలో అసలైన మతధర్మం లేదని నిరశిస్తే పురోహితులు మండిపడ్తున్నారు. అయినా సరే నాపత్రిక స్థాపించిన ముఖ్యోద్దేశం నెరవేరడానికి వీరందరిని దుయ్యపట్టక తప్పదు" అని నిర్మొహమాటంగా రాశారు వీరేశలింగం పంతులు. ఆ కాలంలో జన జీవితం చాలావరకు మతాధిపతుల, పీఠాధిపతుల ఆజ్ఞలకూ, నిబంధనలకూ లోబడి వుండవలసి వచ్చేది. ఒక కులంవారు, యింకో కులంవారితో భోజనంచేస్తే వెలివేయడం, ఆడపిల్లలకు చిన్న వయసులో పెళ్లిచేయకపోయినా, వర్ణాంతర వివాహాలు చేసుకున్నా సంఘ బహిష్కారం మొదలైనవి జరుగుతూ వుండేవి. ఇక స్త్రీలని మరీ హీనంగా చూశేవారు, అర్థంలేని ఆచారాలు పాటిస్తూ అజ్ఞానంలో మునిగి వుండేవారు, వితంతువులు పసిబాలికలైనా సరే, కేశఖండనం చేయించడం శుభ కార్యాలకు రానివ్వకపోవడం, సరియైన ఆహారం బట్టలూ యివ్వకపోవడం కూడా జరిగేది.

ఈ రోజుల్లో ప్రతికుటుంబం తనకు నచ్చిన రీతుల్లో, కుటుంబ సభ్యులకు ఏది 'మంచి' అంటే అది ఆచరించే స్వేచ్ఛను కలిగివుంది. కొద్దిశాతం స్త్రీలయినా, విద్యావంతులూ, ఆర్థికంగా

స్వతంత్రులు అయి సంఘంలో గౌరవ స్థానం సంపాదించుకొన్నారు. ఒక వంద సం॥లలో కలిగిన ఈ పరిణామానికి, వీరేశలింగం, గురజాడ అప్పారావు వంటి మహాపురుషుల కృషీ, రచనలే కారణం.

మనకి స్వాతంత్ర్యం రావడానికి మునుపే, తెలుగులో వార్తాపత్రికల ప్రచురణ ఆరంభమై ప్రజల, సాంఘిక, రాజకీయ అభిరుచులకూ, ఆశయాలకు అవి వరవడి దిద్దాయి.

1902లో కృష్ణాపత్రిక, 1909లో ఆంధ్రపత్రిక, 1925లో గోలకొండ పత్రిక, 1938 లో ఆంధ్రప్రభల స్థాపన జరిగింది. ఆ కాలంలో నిరక్షరాశ్యత యెక్కువగావున్న, పల్లెసీమల్లో ఒకరు వార్తాపత్రిక చదవుతుంటే, పాతిక ముప్ఫయిమంది చుట్టూచేరి శ్రద్ధగా వినడం, సర్వసామాన్యంగా వుండేది. ఈ విధంగా ఆధునిక కాలంలో ప్రజలను సమీపించి, సమీకరించి వారిని ప్రభావితంచేసిన గొప్ప ప్రచార సాధనం అచ్చుయంత్రం అని చెప్పవచ్చును.

ఇక నాటకాలూ, బుర్రకథలూ ప్రజలలో కలిగించిన రాజకీయ చైతన్యం అపూర్వమైనది. తెలుగు దేశపు నాటక చరిత్రను పరిశీలిస్తే యీ శతాబ్దపు నలభైల వరకూ పౌరాణిక నాటకాలదే అగ్రస్థానంగా కనపడుతుంది. స్వాతంత్ర్య పోరాటబీజాలు మొలకెత్తడంఆరంభమవగానే చారిత్రక నాటకాల ద్వారా అన్యాపదేశంగా ప్రజల దాస్యాన్నిప్రేక్షకులకుస్ఫురింపవేయడం మొదలయింది. విజయనగర పతనం, ప్రతాపరుద్రీయం వంటి నాటకాలు దేశభక్తి, స్వేచ్ఛకై ఆరాటం ప్రేక్షకులలో కలిగింపచేశాయి. మెల్లిమెల్లిగా సాంఘిక యితివృత్తాలలో నాటకాలు రావడం, భూస్వామ్యం, అవిద్య, వేశ్యావృత్తి, వరకట్నాలు మొదలైన సమస్యలకు ప్రాధాన్యం యివ్వడం కూడా జరిగింది. ఇవీ యింకా యితర సమస్యలూ, సమాజంలోని వర్గభేదాలూ స్త్రీలకు జరిగే అన్యాయాలు, నిరుద్యోగ యువకులలో నిరాశా, నిస్సహాయతా, యిటువంటి సమస్యలు చిత్రించిన నాటకాలు గూడా విజయవంతమైనాయి. తీవ్రమైన వుద్రేక పూరితమైన, నటనా విధానం పటిష్టమైన, సంభాషణలు, ప్రేక్షకులను ఆవేశపూరితులను చేయడం, ఆయా సమస్యలపట్ల అవగాహన కలిగించడం చేశేవి.

ప్రచారసాధనాలు అన్నింటిలోకి, అన్ని వర్గాల ప్రజలలోకి సూటిగా చొచ్చుకు పోయేది బుర్రకథ. అయితే అది ఒకప్పటి పరిస్థితి. అల్లూరి సీతారామరాజు కథ, బొబ్బిలి యుద్ధం, పలనాటివీరచరిత్ర మొ॥లైన బుర్రకథలను రాజకీయ ప్రచారానికై వినియోగించుకున్నా. సాంఘికదురాచారాలను గురించిన బుర్రకథలు కూడాప్రజలను వుర్రూతలూగించేవి. కరువు కాలంలో, వరదల సమయంలో ప్రజల మనస్సులూగేటట్లు బుర్రకథలుచెప్పి విరాళాలు సేకరించడం,ఆ రోజులలో తరచుగా జరిగేది. చలన చిత్రాల

ప్రవేశంతో నాటకాల, బుర్రకథల ప్రాముఖ్యం పూర్తిగా తగ్గిపోయింది.

మూకీలు పోయి, టాకీలు రావడంతో సంభాషణల ద్వారా ప్రజలకు యెన్నో తెలియచెప్పే అవకాశం వుందని, నిర్మాతలు గ్రహించారు. స్వతంత్రం వచ్చిన పదియేండ్లవరకూ, సినిమాలు సాంఘిక ప్రయోజనం కోసమే తీయాలనే ఆదర్శం నిర్మాతలకు వుండేది. కులతత్వాన్ని నిరసిస్తూ, 'మాలపిల్ల', వితంతు వివాహాలని సమర్థిస్తూ 'సుమంగళి', యింకా స్వర్గసీమ వంటి చిత్రాలు స్వాతంత్ర్యానికి ముందూ, షావుకారు, పల్లెటూరు, రోజులుమారాయి వంటి సందేశాత్మకమైన చిత్రాలు తరువాత వచ్చాయి.

ఈలోగా దేశమంతటా రేడియో వినడం విద్యావంతులకీ, నిరక్షరాస్యులకీ నిత్యజీవితంలో ఒకభాగంగా అలవాటైపోయింది. సుమారు 50 సం॥లుగా రేడియో కార్యక్రమాలు ప్రసారమవుతున్నాయి.

మద్రాసు నగరంలో 1924లోనే మద్రాసు ప్రెసిడెన్సీ రేడియోక్లబ్ అనే సంస్థ కార్యక్రమాలు ప్రసారం చేసేది. 1934 నుండి ప్రభుత్వమే రేడియో నడపటం ఆరంభించింది. ఆలిండియా రేడియో అనేపేరుతో దేశవ్యాప్తంగా కార్యక్రమాల ప్రసారాలు ఆరంభమయ్యాయి. అన్నిప్రాంతాలలో కేంద్రాలు వివిధ భాషలలో ప్రసారాలుచేసి, ప్రజలకు అత్యంత సన్నిహితంగా వచ్చింది,

రేడియో ద్వారా సులభగ్రాహ్యమైన వ్యావహారిక భాష ప్రజలలో ప్రాదుర్యం పొందింది.




# క్షయ రోగంతో పోరాడండి

1 రెండు వారాలకు మించి ఎడతెరిపిలేకుండా మీకు దగ్గు ఉన్నప్పుడు లేక ఉమ్మిలో రక్తాన్ని గమనించినప్పుడు ఊపిరితిత్తులకు సంబంధించిన క్షయ రోగంతో మీరు బాధపడుతూ ఉండవచ్చు

2 మీ సమీపమందలి ప్రాథమిక ఆరోగ్య కేంద్రం డిస్పెన్సరీ లేక టి.బి. సెంటరులో ముఖ్యంగా మీ ఉమ్మితో సహా మిమ్మల్ని పరీక్ష చేయించుకోండి



3 నిర్ధారిత సమయం వరకు క్రమంగా డాక్టరు ఇచ్చిన సలహా ప్రకారం మందులను తీసుకున్నట్లయితే క్షయ రోగాన్ని నయం చేయవచ్చు

4 చికిత్సకంటె ముందు జాగ్రత్తలు తీసుకోవటం ఎప్పుడూ మంచిది అందుచేత మీ బిడ్డకు బి.సి.జి. టీకాలు వేయించండి



సెంట్రల్ హెల్త్ బ్యూరో (డి.జి.హెచ్.ఎస్)
మినిస్ట్రీ ఆఫ్ హెల్త్ అండ్ ఫ్యామిలీ వెల్ఫేర్
కోట్లా రోడ్డు, న్యూ ఢిల్లీ.

davp 88/347 TEL

ప్రధానంగా వార్తలకోసం రేడియో మీద ఆధారపడినా, త్వరలోనే గ్రామ సీమల్లో, వ్యవసాయదారులూ, పాడి, పంటా చూసుకొనేవారు. రేడియోలో చెప్పే సలహాలు, విజ్ఞాన విషయాలు తమకు ప్రయోజనకరంగా వున్నాయనే సంగతి గ్రహించారు. కార్మికులకు వినోదం పంచిపెట్టింది రేడియో. దేశంలో యెక్కడెక్కడేమి జరుగు తున్నా, అభివృద్ధీ, మార్పులూ ప్రతీ మారుమూల పల్లెలో ప్రతిధ్వనించి, అందరమూ యీ విశాల దేశంలో, భాగస్వాములమనే చైతన్యం, ఐక్య భావం కూడా రేడియో సాధించిందంటే అతిశయోక్తి కాదు. బాలబాలికలూ మహిళలూ, చిన్న చిన్న సంఘాలుగా ఏర్పడి ప్రత్యేక కార్యక్రమాలలో పాల్గొనడం, వారి జీవితాలకు కొత్త వుత్సాహమూ, ఆశయమూ కలిగించేయి.

ఈ మహిళా కార్యక్రమాలు, పత్రికలలో వారికై ప్రత్యేకించిన శీర్షికలూ స్త్రీలు తమ అభిప్రాయాలు ప్రకటించుకొనే వేదికలుగా వుపయోగ పడుతున్నాయి.

శాస్త్రీయ సంగీతమే కాకుండా లలిత సంగీతం అనే పేరుతో గేయాలూ, గీతాలూ, సరళమైన రీతిలో ప్రచారమైనాయి. ప్రతి యింట్లో రేడియో పాటలు వినడం, పాడుకోవడం అలవాటైనాయి. సంగీత సాహిత్యాలను ప్రతీ చిన్నా, పెద్దా యింటి లోపలకు, చివరకు వంట యింటిలోనికి పరిచయం చేసిన ఘనత ఆకాశవాణికి దక్కింది.

గత ఏడెనిమిదేళ్లుగా ప్రజా జీవితాన్ని విపరీతంగా ప్రభావితం చేస్తున్నది టెలివిజన్. రేడియో శ్రవణ యంత్రం మాత్రమే. టెలివిజన్ దృశ్య శ్రవణ యంత్రం. విద్యావంతులపై, విద్యాహీనులపై మేధాశక్తి అతి తక్కువగా వున్నవారిపై సహితం టి.వి. గాఢమైన ముద్ర వేస్తుంది.

ఒకప్పుడు విద్యార్థులకు మాత్రమే పరిమితం అనుకునే విజ్ఞాన విషయ సేకరణ సంబంధమైన 'ప్రశ్నావళి' కార్యక్రమాలు టి.వి. ద్వారా, చిన్నా పెద్దా అందరినీ ఆకర్షించడం మనం చూస్తున్న పెద్ద మార్పు.

నాటకాలూ, చర్చలూ, అభిప్రాయ సేకరణాలూ మొదలైన వాటి ద్వారా పరిమిత కుటుంబాలు, ఆరోగ్యం, వాతావరణ కాలుష్యం వంటి విషయాలను గురించి ప్రతివారూ తెలుసుకుంటున్నారు.

టి.వి. లో ఒక కుటుంబ గాధను సీరియల్‌గా దీర్ఘకాలం ప్రసారం చేసినప్పుడు ఆ కథలో చిత్రించిన సమస్యలూ, పాత్రలూ ప్రేక్షకులలో గాఢంగా నాటుకు పోతాయని, యీ విధంగా కొంత సాంఘిక ప్రయోజనం సాధించవచ్చునీ ప్రయోగాల ద్వారా గ్రహించారు. ఇటువంటి సీరియల్ కథలను 'సోప్ ఒపెరాలు' అంటారు. ఒక పెద్ద కుటుంబాన్ని యితివృత్తానికి యెన్నుకుంటారు. రకరకాల మన స్తత్వాలు, సమస్యలూ, ప్రేమ, అను

రాగం, ద్వేషం, నాటకీయత - రసో చితమైన సంభాషణలూ వుండటం వలన యివి ప్రేక్షకులని బాగా ఆకట్టు కుంటయ్. ఉదాహరణికి కథలో ఒక అమ్మాయి భర్త త్రాగుబోతూ, దుర్మా ర్గుడూ అయి, ఆ అమ్మాయి అతనికి విడాకులివ్వడం జరిగితే ప్రేక్షకులలో కలిగించిన సానుభూతి వలన, విడా కుల వలన తప్పులేదనీ, స్త్రీలు ధైర్యంగా వుంటే సమాజంలో ఒంటరిగా జీవించగలరనీ, ఆ అభి ప్రాయాలు క్రమ క్రమంగా ప్రజలలో నాటుకుంటాయి. ఇటువంటివి యింకా యెన్నో ప్రయోగాలు జరగడం సత్ఫ లితాలు యివ్వడం మనం చూడవచ్చు.

ఇప్పటివరకూ ప్రింట్ మీడియా, సినిమాలు, నాటకాలూ, రేడియో, టెలి విషన్, ప్రజా జీవితంలో మార్పుతే గలిగిన, యెంత బలమైన సాధనాలో చెప్పుకున్నాం. ఇప్పుడు వర్తమాన సమాజంలో జరుగుతున్న వాస్తవికత ఏమిటో పరిశీలిద్దాం.

పత్రికలు ఒకప్పుడు ఏ ఆశయా లతో అయితే స్థాపించారో, యిప్పుడు వాటికి సరిగ్గా విరుద్ధంగా తయార య్యాయి. దాదాపు అన్ని పత్రికలలో గ్రహచారాలూ, వారఫలితాలూ, నక్షత్ర బలాలూ - యింకా హస్త సాముద్రికాలూ, జ్యోతిష్యవాణులు - పాఠకులను అభ్యుదయం వైపు కాదు - తప్పుదారిన నడిపించడమే పత్రికల లక్ష్యంగా కనిపిస్తున్నది. స్త్రీలను అగౌరవపరుస్తూ చిత్రించే బొమ్మలు, ఏ సాహిత్య విలువలూ లేని కథలూ, నవలలూ, జుగుప్స కలిగించే సమా చారంతో పత్రికలు నిండి వుంటు న్నాయి. కొత్తతరం పాఠకులలో 90 శాతం మంచి అభిరుచి అంటే ఏమిటో తెలియని అయోమయావస్థలో వున్నారు. భారీ వ్యాపారాలు, గట్టి ఆర్థికసత్తా వెనకాల వున్న యీ పత్రికా యాజమాన్యాలకి యెక్కువ సంఖ్యలో పత్రిక అమ్మకమయి, లాభాలను సంపాదించాలనే తప్ప వేరే ఏ సదా శయాలు లేవు. ఇటువంటి పోటీలకు తట్టుకొని పరిమితమైన పాఠక లోకంతో నడుస్తున్న చిన్న పత్రికలే కొన్ని ప్రత్యేకమైన లక్ష్యాలను చిత్త శుద్ధితో అమలుపరుస్తూ వుండటం సంతోషించవలసిన సంగతి.

వార్తాపత్రికలలో రాజకీయాలకీ, సినిమా వార్తలకే ప్రాధాన్యం. ఇందు వలన సామాన్య పాఠకుల దృష్టిలో రాజకీయ నాయకులూ, సినిమా తారలే ఆదర్శపురుషులు. సంఘసేవ చేసే వారూ, ఆలోచనాపరులూ, మేధా వులూ ఏమంటున్నారో, ఏం చేస్తు న్నారో అన్నది వుండనే వుండదు. ఇక యువతరంలో ఏ గొప్ప ఆద ర్శాలూ, ఆశయాలూ ఉద్భవిస్తాయి?

సినిమాల వద్దకి వస్తే కథా, సంభా షణలూ, నీతులు వుపదేశిస్తూ వుంటే, పాత్రల వేషభూషణాలూ ప్రవర్తన అందుకు విరుద్ధంగా వుంటాయ్. ఉ॥కి ఒక డాక్టర్ సినిమాలో హీరోయిన్ అయినప్పుడు ఆమె మాటలు ఆదర్శ పూరితంగానే వుంటాయి గాని, వేల రూ॥ లు ఖరీదు చేసే చీర కట్టుకొని,

వంటినిండా నగలు వేసుకుంటుంది. ఇల్లు ఐశ్వర్యంతో తులతూగు తుంటుంది. ప్రేక్షకుల మనసుల్లో యిదే ముద్ర వేసుకుంటుంది. చాలా సినిమాల్లో హీరో ఏదో విధంగా డబ్బు సంపాదించి ధనవంతుడవు తాడు. ప్రేక్షకులలో చాలామంది డబ్బు సంపాదించడమే జీవిత పర మార్థం అని అర్థం చేసుకొని ఆచరిం చాలని ప్రయత్నిస్తారు. కొత్త కొత్త పద్ధతులలో నేరాలూ, హింసా యెక్కువ అవుతున్నాయ్.

మొన్న మొన్న అంటే సెప్టెంబరు 14న (1987) దేవ్‌రాలా అనే గ్రామంలో రూప్ కన్వార్ అనే 18 ఏండ్ల అమ్మాయి భర్తతోపాటు సహ గమనం చేసింది. ఆ ప్రాంతంలోని వేలాది ప్రజలు అది ప్రత్యక్షంగా చూసి హర్షించారు. ఆ అమాయిక యువతి మూఢత్వానికి ఆ ప్రజల అనా గరిక ప్రవర్తనకి - పతివ్రతా శిరోమ ణుల గురించి దేవతల మహాత్యాలను గురించి వచ్చిన సినిమాలే కారణం అనడంలో ఏ మాత్రమూ సందేహము లేదు. కాలేజీలలో జంతుశాస్త్రం అభ్య సించిన అమ్మాయిలూ 'నాగదేవత' సినిమాలు చూసి సంతోషించడం నాగ దేవతకి వ్రతాలూ ముడుపులూ చెల్లిం చడం మనచుట్టూరా గమనించవచ్చు.

ఇంకొక ప్రక్కన పత్రికలలోనూ టి.వి.లోనూ వచ్చే వాణిజ్య ప్రకటనల ప్రభావంకూడా ప్రజలలో కనపడు తున్నది. టి.వి.లో వచ్చే వ్యాపార ప్రకటనలు ప్రతీరోజూ చూడటం వలన ప్రేక్షకుల మనసులని గాఢంగ తాకుతయి. చిన్న వుదాహరణ, సాధా రణంగా ఈ ప్రకటనలలో ప్రతిబిం బించే జీవిత విధానం విదేశాలల లాగానో, లేదూ, చాగా పైతరగతికి చెందిన వారిది లాగానో వుంటుంది అందులో కుటుంబం అని చూపినప్పుడు పెద్దవారూ, వృద్ధులూ వుండరు. ఖరీ దైన వస్తువులు సేకరించడమే కుటుంబ లక్ష్యంగా వుంటుంది.

ఇంకొక వ్యాపార ప్రకటనలో పిల్లలు ఆడుకొని పరుగెత్తుకుంటూ ఇంట్లోకి భోజనాల బల్లవద్దకు వచ్చి ఏదో తింటూ వుంటారు. మన వాతా వరణంలో, మన వీధులు వుండే స్థితికి బయట నుండి వచ్చినప్పుడు చెప్పులు విప్పేసి కాళ్ళూ, చేతులు కడుక్కోవడం ఆరోగ్యానికి మంచిది.

చివరకు మన సమాజం బాహ్యమైన అలవాట్లలో, ఆడంబరాలలో ఆధునికం గానూ జీవితంలో అతి ముఖ్యమైన విషయాలలో ఛాందసంగానూ తయ్యా రయే పరిస్థితి వచ్చింది. శాసనాల ద్వారా మాత్రమే ప్రజలలో మార్పు రావాలంటే సాధ్యమయ్యే పనికాదు. 1829లో యించుమించు 160 సం॥ల క్రిందట సతీనిరోధచట్టం వచ్చింది. బాల్యవివాహాలు నిషేధిస్తూ 1930లో శారదాబిల్లు వచ్చింది. ఈ రెండూ రాజస్థాన్‌లో యింకా కొనసాగుతూనే వున్నాయ్. ప్రజలలో చైతన్యానికి దాని మీడియా సాధనాలు తోడ్పడవలసిన అవసరం ఎంతైనా ఉంది.

**'ఆకాశవాణి' సౌజన్యంతో**

న్యూఢిల్లీలో

# 'స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్ కాన్సర్ట్‌స్'
## (The Spirit of Freedom Concerts)
### 'బి సి ఐ సి' & 'వి యస్ టి'

'భారతరత్న' ఇందిరాగాంధీ జన్మ దినోత్సవాన్ని పురస్కరించుకుని 1988 నవంబర్ 18 శుక్రవారం భక్తి సంగీతోత్సవం; 19వ తేదీ శనివారం, 20 వ తేదీ ఆదివారం 'స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్ కాన్సర్ట్‌స్' - స్థలం : తాల్‌కటోరా ఇన్‌డోర్ స్టేడియమ్, న్యూఢిల్లీ.

వివిధ నగరాలలో 12 సాంస్కృతికోత్సవాలు వైభవంగా, విజయవంతంగా జరిపి, కళల ద్వారా సమైక్యత సాధించగలమని నిరూపించిన సాంస్కృతిక సంస్థ 'భారత కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటి'.

ఇక, వి.ఎస్. టి ఇండస్ట్రీస్ లిమిటెడ్ వారు, సంగీత నృత్యాలు, నాటకాలు, క్రీడలు వీటి అభివృద్ధికి ఎంతగానో తోడ్పడుతున్నారు. ఎన్నో గొప్ప గొప్ప సంగీత సమ్మేళనాలు, పాశ్చాత్య సంగీత కార్యక్రమాలు, నాటకాలు ఏర్పాటు చేశారు. సోనాల్ మాన్‌సింగ్, సంయుక్త పాణిగ్రాహి, చిత్రా విశ్వేశ్వరన్, రోహింటన్ కార్క్, డానియల్ మలోనీ, కార్‌మన్ డిలవాల్ట్ మొదలగు వారి నృత్య ప్రదర్శనల ద్వారా కళల అభివృద్ధికి ఎంతో కృషి సల్పుతున్నారు.

గతంలో బి.సి.ఐ.సి., వి. ఎస్. టి. ఇండస్ట్రీస్ లిమిటెడ్ వారు కలిసి, మద్రాసు, ఢిల్లీ నగరాలలో 'స్పిరిట్ ఆఫ్ ఫ్రీడం కాన్సర్ట్స్' నిర్వహించిన విషయం మీకు తెలిసినదే!

దేశ సమగ్రత సమైక్యతల ఆవశ్యకతను చాటే యీ సంగీత నృత్యోత్సవంలో ప్రపంచ ప్రఖ్యాత కళాకారులు పాల్గొంటున్నారు.

జాతీయ సమైక్యత తన ధ్యేయంగా 'భారత కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటి' 1981లో స్థాపించబడినది. లలిత కళలను అలంబనగా చేసుకొని, తద్వారా సమైక్యతా కృషిని దేశం నలుమూలలా కొనసాగిస్తూ ఇంతవరకూ మద్రాసు, బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, హైదరాబాద్, విశాఖపట్నం, జంషెడ్పూర్, భిలాయ్, విజయవాడ పట్టణాలలో పన్నెండు సంగీతోత్సవాలు జరిపింది. మాజీ ఉపరాష్ట్రపతి బి.డి. జెట్టి ఛైర్మన్. భారత అటార్నీ జనరల్ కె. పరాశరన్ రిసెప్షన్ కమిటి ఛైర్మన్; టి.వి.కె శాస్త్రి ఈ సంస్థకు సారథి. వివిధరంగాలకు చెందిన శాస్త్రజ్ఞులు, డాక్టర్లు పారిశ్రామికవేత్తలు, కవులు, గాయకులు,

ఉన్నతాధికారులు ఎందరో ఈ సంస్థ కార్యకలాపాలలో ఆసక్తి చూపుతున్నారు.

మనిషికి ఏకాగ్రతను, మనశ్శాంతిని కలుగచేసేది - ధ్యానం. ఏదో ఒక దైవాన్ని తల్చుకుని ధ్యానం చేయడం మనకు అలవాటు. మన మతాభిమతాల మేరకు వివిధ రూపాలను, పేర్లను సృష్టించి లక్ష్మి, సరస్వతీ, పార్వతి, రాజరాజేశ్వరి, పద్మావతి, కన్యకాపరమేశ్వరి, సంతోషిమాతా, కనుమారియమ్మ, వేళాంగిణి యిలా అనేక నామాలతో స్త్రీ రూపంలోను పురుష రూపంలోను పూజిస్తుంటాము.

పద్మావతీ అమ్మవారికి శాస్త్రోక్తంగా వేదపఠనంతో, భక్తి ప్రపత్తులతో కుంకుమార్చన జరుగుతుంది.

## శుక్రవారం - 1988 నవంబరు 18

ప్రముఖ నర్తకి మిత్రప్రభ నృత్యాంజలి సమర్పించగా ప్రముఖ నేపథ్యగాయని వాణీజయరాం, శ్రోతలకు తన గాత్ర మాధుర్యంతో ఆనందింపచేస్తారు.

## శనివారం - నవంబరు 19

ప్రసిద్ధ ధ్రుపద్ గాయకులు డాగర్ సహోదరుల గానం ఒక్క మధురానుభూతి. ఇక, మంగళంపల్లి బాలమురళీ కృష్ణ కన్యాకుమారి నుండి కాశ్మీరం వరకు, ఆంధ్రా నుండి అమెరికా వరకు సంగీత ప్రియులకు గాన సుధాకరుడు.

ప్రపంచ ప్రఖ్యాత బ్రిజ్ మహరాజ్ తన బృందంతో కథక్ నృత్యాన్ని ప్రదర్శిస్తారు. అభినయ కౌశలం ప్రేక్షకులని రసార్ణవంలో మునకలు వేయిస్తుంది.

## ఆదివారం - నవంబరు 20

నేపథ్య గాయకుడు ఎస్.పి. బాలసుబ్రమణ్యం, ఆయన సోదరి శైలజ తమ లలిత సంగీతంతో వీనులవిందు చేస్తారు. తర్వాత వయొలిన్‌తో టి.ఎన్ కృష్ణన్, సరోద్‌తో అంజాద్ ఆలీఖాన్ జరిపే 'జుగల్బంది' ఉత్తర దక్షిణాల మేలు కలయికలా సంగీత ఝురి ప్రవహిస్తుంది.

☀

ఈ బృహత్ కార్యక్రమానికి టికెట్లు లేవు. ప్రవేశరుసుము లేదు. కాని, ప్రవేశపత్రాలు మాత్రం - అడ్మిషన్ కార్డ్స్ - ముందుగా పొందాలి. ప్రవేశ పత్రాలు వీరి వద్ద లభిస్తాయి ;

(1) పి. ఆనంద్‌రావ్, కన్వీనర్ ; బి.సి.ఐ.సి., మార్కెటింగ్ మానేజర్ ; స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, చంద్రలోక్, 36-జనపథ్, న్యూఢిల్లీ - 110 001. (ఫోన్ నెం. 3327484)

(2) ఎన్. వి. ఎల్. నా గ రా జు, జాయింట్ కన్వీనర్ ; బి.సి.ఐ.సి., ఎల్ - 2/159 - డి.డి.ఏ. ఫ్లాట్స్ కల్కాజీ, న్యూఢిల్లీ - 110 019. (ఫోన్ నెం. 64 61 731) ☀

సీరియల్

# మజిలి

## అన్నపూర్ణారెడ్డి

గడిచిన కథ : డాక్టరు సారథి తోబుట్టువు గాయత్రి తన పిల్లలతో అన్నగారున్న పల్లెటూరు వస్తుంది. ఆ ఊళ్లోని మహిళామండలి మెంబర్లని పరిచయం చేసుకు వారిని తమ ఇంటికి పిలుస్తుంది. అయితే ఆ యింట్లోని జానకి స్థానమేమిటో బోధపడకుండా ఉంది గాయత్రికి .... ఇక చదవండి.

సెలవు పుచ్చుకొని గూడు బండిలో కూర్చుంది గాయత్రి. బండి డాక్టరు గారి ఇంటివేపు దూసుకుపోయింది.

ఆ రాత్రంతా ఆలోచన చేసి పార్టీకి ఏఏ అయిటమ్స్ పెట్టాలో నిర్ణయించుకుంది. మరుదినం జానకిని పిల్చి 'చూడు జానకీ రేపు మధ్యాహ్నం రెండు గంటలకు ఇక్కడికి మహిళా మండలి సభ్యులు వస్తారు. మైసూర్ పాక్, మిక్చర్ చేయగలవా? ఒకటో నెంబర్ ఫిల్టర్ కాఫీ కావాలి. పార్టీలో అందరి మధ్యా కూర్చొని అది కావాలి ఇది కావాలి అని అరిచే పని నాకు కల్పించకుండా అన్నిపనులూ నీవు చూచుకోవాలి. విజ్జిని తోడుతీసుకో.... అంది దర్పంగా గాయత్రి.'

"అవసరం లేదండీ - నేను సమాళించుకోగలను.... విజ్జి పసిబిడ్డ - ఏం చేయగలడు ?" అంది జానకి.

"అదే వద్దనేది.... అలా గారం చేస్తే రేపు పెరిగి పెద్దయ్యాక, పూచిక పుల్ల ఎత్తు పని చేసుకోకపోతే .... పుట్టింటి వారి నంటారు. ఆడపిల్ల పని చేస్తె తప్పులేదులే !" అంది.

ఈ మనిషితో వాదించి లాభం లేదన్నట్టు కళ్ళెత్తి క్షణకాల గాయత్రి వంక చూచి మిన్నకుండి పోయింది జానకి.

ఆరోజు దగ్గరలో వున్న టౌనుకు మనిషిని పంపి బ్రెడ్ తెప్పించింది గాయత్రి. దగ్గరుండి బ్రెడ్ మిఠాయి చేయించింది అర్ధనంగా.

పార్టీకోసం చెల్లి వేస్తున్న ఆర్భాటం పిల్లల ద్వారా విన్న సారథి చిరునవ్వుతో మిన్నకుండిపోయాడు.

### 8

నాలుగు బల్లలు జోడించి గళ్ళ దుప్పటి పరిచి, ఇత్తడి పూలకుండీతోను విజ్జి, రవి, నారాయణ కోసుకొచ్చిన అడవిపూల గుత్తులు అందులో పొందికగా అమర్చింది జానకి.

కావలసిన గ్లాసు సామానంత సందువా పెట్టెనుండీ బైటలాగి వేరే బల్ల మీద అమర్చింది.

గ్లాస్ జగ్ నిండా షర్బత్ నింపి ఓ ప్రక్కగా వుంచింది. పదార్థాలన్నీ మూతలున్న గిన్నెల్లో వేసి పరుసనే వుంచి అన్నింటిలోనూ తీసుకోవడానికి అనువుగా గరిటలు వుంచింది.

సారథి ఆ దినం మీటింగ్ వుందని సమతి ఆఫీసులో వుండిపోయాడు.

ఎంతపనిలో లీనమైవున్నా జానకి ఎదలో ఏదో అలజడి. ఈలా తను మనుష్యుల ఎదుటపడాల్సిన అవసరం ఊహించ లేదు. ఈ రోజు అన్ని జతల కళ్లు తన మీదే వుండి శల్య పరీక్ష చేస్తుంటే! ఇక పై ఊహించ లేక పోయింది. అందుకే వడ్డన వార్పు అని రెండో మనిషి అవసరం లేకుండా బఫె స్టయిలులో అన్నీ బల్లమీదే అమర్చింది.

గాయత్రికి ఈ పద్ధతి నచ్చక పోయినా పల్లెటూరి వారికి కేవలం వెర యటీ చూపిస్తూ తన గొప్పతనం ప్రదర్శించుకోవడమే ధ్యేయం కాబట్టి అప్పటికి వూరుకుండిపోయింది.

వచ్చినవాళ్ళను విజ్జి, రవి దగ్గిర వుండి ఆహ్వానించి కూర్చో పెట్టారు.

ఒకరిని మించి మరొకరు అలంక రించుకొని బొమ్మల కొలువులా కూర్చుని వున్నారు. ముఖ్య సేవిక విమల ఆరోజు పార్టీకి రావడంతో, తను ఇస్తున్న పార్టీకి సాఫల్యం దక్కి నట్టు భావించింది గాయత్రి. కారణం ఒక వ్యక్తి అయినా చదువుకున్నది వున్నందుకు.

బఫే పార్టీ మోదట బిడియంగా మొదలై, కడపటికి రణ గొణగా తయారైంది. సభ్యత కూడా మరచి గడియ గడియకూ వెళ్ళి 'బ్రెడ్ మిఠా' తెచ్చుకొని లొట్టలు వేస్తూ ఆ చెంచాలు ప్రక్కన పెట్టేసి వ్రేళ్ళతోనే నాలుక్కు రాచుకొంటూ, "గాయత్రీదేవిగారూ ....దీన్నే మంటారో గానీ .... అమృతం!.... బహుశా దేవతలు తిని వుంటారీ పదార్థం ...." అబ్బ ఏం మధురం .... "అంటూ దెబ్బకు గిన్నె ఖాళీ చేసేశారు.

కాస్సేపు తన అత్త వారింటి వైభవం తమ ఊళ్లో తను నడిపించే మండలి కార్య కలాపాలు, పోటీగా నడిచే, మండలుల గొడవలు వర్ణించి చెప్పింది గాయత్రి. అంత సేపు తను వక్త, వాళ్లు శ్రోతలే అయ్యారు.

శర్బత్‌లు, కాఫీలు ఒకదాని వెంట ఒకటి తాగేసి, వక్కపొడి నముల్తూ కబుర్లలో పడ్డారు. అందరి కళ్లూ లోపలి గుమ్మం వైపే వున్నాయి.

"ఏమండీ డాక్టరుగారి భార్య కన బడరేం?"

"లోపల వున్నారేమో?"

"ఉంటే బైటకు రారా?"

"ఊళ్ళో లేరేమో?"

"లేదు.... ఉన్నారు.... ఇందాక లోపల చీర కుచ్చెళ్లు అవుపించాయి"

"మరి సిగ్గా?"

"కాదు డాక్టరు భార్యననే నిర్లక్ష్య మేమో?"

"కాదు.... అందకత్తె కాదులా వుంది!" ఓ వంక గాయత్రితో మాట్లాడుతూనే వాళ్ళల్లో వాళ్లు అ కనుపించని డాక్టరు భార్య గురించి గుసగుసలు పోసాగారు.

గాయత్రికి కూడా యమ సమస్యగానే వుండి పోయింది. జానకికి ఈ ఇంటికిగల సంబంధ మేమిటో తనకు తెలియదు. జానకి కూడా కలుపుగోలు మనిషి కాదు. అందుకే ఆడవాళ్ల మధ్య నలుగుతున్న సంభాషణ తన చెవి దాకా వస్తున్నా విననట్టు వినకుండి పోయింది గాయత్రి.

మొత్తానికి పార్టీ జయప్రదంగా ముగిసింది.

కొంతమంది బ్రెడ్ మిరా గురించి వివరాలు అడిగారు. మరి కొంతమంది నిట్టింగ్ గురించి అడిగారు.

తాము సరిహద్దుల్లోని జవానులకు, రెడ్ క్రాస్ సంస్థలకు ఎన్నెన్ని స్వెట్టర్లు, చొక్కాలు తయారు చేసి పంపించారో ఏకరువు పెట్టింది గాయత్రి.

"అందరికీ పంపించావుగాని నాకు మాత్రం స్వెట్టర్ ఇంకా అల్లుతూనే వున్నావుగా మమ్మీ" అంది చైతన్య అమాయకంగా.




క్రివేణి® ఇంకు
గమ్
ఆఫీసుపేస్టు
వాడి,
వాటి విశిష్టతను
గమనించండి.
IS:1221-71
ISI
తయారుచేయువారు:
కృష్ణవేణి ఇంకు ఫ్యాక్టరీ
751, తిరువత్తియూర్ హై రోడ్, మద్రాసు-600 081




క్షణకాలం ముఖం మాడిపోయినా నవ్వుతూ "నీకు కావలసిన రంగు ఊలుకు రాశాగా.... పైగా లూధి యానా నుండీ రావాలి" అంది గాయత్రి చైతన్య జుట్టు సవరిస్తూ.

అందరికీ డాక్టరుగారి భార్య బైటకు రాలేదని గొప్ప నిరాశ కల్గింది మన సులో.

బహుశా బైటకు రాకూడదని కట్టడి చేశాడేమో డాక్టరు - అనుకున్నారు నెమ్మదిగా.

సెలవు తీసుకొని వెళ్ళిపోయారు.

జానకికి ఆరోజంతా వంటకాలతోటే! సాయంత్రం అన్నీ కడుక్కొని తుడుచు కొని సర్దుకొనేసరికి ప్రొద్దుకుంకి పోయింది.

9

ఆరాత్రి సారథి భోంచేసి పేపరుచేత పట్టుకొని వాలు కుర్చీలో కూర్చున్నాడు.

తమతో సమంగా ప్రక్కింటి కొండ ముచ్చు (నారాయణ) గాడికి జానకి పిలిచి టిఫిన్ పెట్టిందని గాయత్రి పిల్లలు ముఖం మాడ్చుకున్నారు.

"ఏం .... ఎందుకు పెట్టకూడదూ? నారాయణ మనలాగ పిల్లవాడు కాదేంటి?" అంది విజ్జి ఆవేశంగా.

"వాడు దొంగ! .... శుభ్రంగా బట్టలులేవు .... వాడు మాతో సరిస మం ఎలా అవుతాడు?" - శీను వాదన.

"బట్టలులేక పోతేనేం, మా మంచి ఫ్రెండ్ వాడు. ఇంట్లోకి రానిస్తాం.... మాతో సమంగా వుండనిస్తాం .... అయినా స్నేహానికి అవన్నీ అడ్డొ స్తాయా?" .... రవి ప్రశ్న.

"ఉత్త డర్టీ పిగ్ వాడు" - నారా యణ మీద అక్కసంతా విజ్జి, రవీల మీద వెళ్ళగక్కి మూతులు బిగింపు కొని తమ గదిలో వుండిపోయారు గాయత్రి పిల్లలు.

ఎంత కాదనుకున్నా దెబ్బలాట తాలూకు ప్రభావం విజ్జి, రవి మీద పడి వాళ్ళు మౌనంగా వసారా చివర కూర్చుండి పోయారు. నారాయణ కుక్క పిల్లను ప్రక్కలో పొదువుకొని వాళ్ళను చూస్తూ దిగులుగా చెట్టు క్రింద కూర్చున్నాడు.

వంటింటిలో గిన్నెలు సర్దు కొంటున్న జానకి మనసు కూడా కకా వికలమైంది. ప్రత్యక్షంగా ఎవరూ తనను ఏమీ అడగక పోయినా తన పట్ల మాటల్లో వ్యక్తం చేసిన కుతూ హలం తలచుకుంటే ఏదో తెలియని భయం ఆవరించింది.

గాయత్రి మరో కుర్చీ జరుపుకొని తమలపాకుల పళ్ళెం ఒడిలో వుంచు కొని ఆకులకు ఈనెలు తీస్తూ "అన్నయ్యా!" అని పిల్చింది.

గాయత్రిని మళ్ళీ ఏదో సమస్య పట్టి పీడిస్తుందని ఊహించిన సారథి

"ఏమ్మా!" అన్నాడు.

"నేను వచ్చి అప్పుడే పక్షం రోజు లైంది. వెళ్ళాలను కొంటున్నా నన్నయ్యా" అంది.

చిన్నగా నవ్వి "ఏమ్మా....! పక్షం రోజులకే బావగారి మీద మనసు పోయిందా?" అన్నాడు.

అన్న చేసిన సున్నితమైన హాస్యా నికి కపోలాలు ఎర్రబడ్డాయి.

"ఆ.... మేమేమన్నా కొత్తజంటా? పిల్లల కిక్కడ ప్రొద్దు పోవడం లేదు. పైగా వాళ్ళ నాన్నగారిని చూడాలని అంటున్నారు. చిన్నవాడు మరీని" అంది.

చాలా సేపు మౌనంగా వుండి పోయాడు సారథి.

కేలండరు వంక చూచి "సరే.... వెళ్తానంటే తప్పుతుందా? అలాగే ఎల్లుండి వెళ్లవుగానీ .... ఏర్పాట్లు చేస్తాను" అన్నాడు.

గాయత్రి తాంబూలం నములుతూ "అన్నయ్యా!" అంది.

ఏమిటన్నట్టు చూశాడు సారథి.

"నీకిష్టమున్నా లేకపోయినా కొన్ని విషయాలు నీకు చెప్పక తప్పదు. జానకి ఎవరంటే సరిగా బదులివ్వవు. అసలు ఈ ఇంటికీ ఆవిడకూ గల సంబంధ బాంధవ్యాలు ఎటువంటివో తెలుసుకొనే అవసరం ఈ యింటి ఆడపడచుగా నాకు లేదా? ఈ ఇంటి బాగోగులు నాకు అక్కరలేదా? చెప్పు అన్నయ్యా! ఒకరి కష్టసుఖాలు ఒకరివి కాదా ?"

సారథి కళ్ళు విస్ఫారితాలయ్యాయి. "ఏమిటమ్మా? ఏం జరిగింది.... ఎందు కంత నిష్ఠూరం" అన్నాడు నిటారుగా కూర్చుంటూ.

"నిష్ఠూరం కాకపోతే ఆ పిల్లలు చూడు. వాళ్ళ పెంపకం చూడు. ఒకరూ మాట వినరు. అలగా వాళ్ళ నంతా నీ ఇంట్లో చేరుస్తారు. అదేమంటే మా ఇష్టం, మా పిన్ని ఇష్టం, అంటారు. పిన్ని అనే మాటకు అర్థం ఏమిటి? ఆ పిన్ని స్థానం ఏమిటి? వ్యవహారాలు ఈలా జరుగుతూ పోతే బహుశా అన్న అనే వాడు ఒకడున్నా డన్న ఆశ వదిలేసుకోవాలలా వుంది. .... చెప్పన్నయ్యా - నీ మనసులో వుండేది .... అంతేగా ?"

బాధతో కాస్సేపు కళ్లు మూసుకొని 'గాయత్రీ! .... అంత లేసి మాటలు అనుకోవలసిన పనిగానీ, అంతగా బాధ పడాల్సిన వ్యవహారం కానీ లేదులే .... జానకికీ ఈ ఇంటికీ సంబంధ బాంధవ్యాలు ఎటువంటివైనా సరే. జానకి సాటి మనిషి .... ఆవిడ పెంప కంలో పిల్లలు పాడవుతున్నారని నేనను కోను. - పిల్లల ఆలనాపాలనలో లోటు లేదనే నా నమ్మకం .... ఇంత చిన్న కారణంగా నీవు హైరానాపడి నన్ను హైరానా పెట్టడంలో అర్థం లేదు. ఎప్పటికీ ఇది నీ పుట్టిల్లే - నీరాక పోకలకు అడ్డులేదు .... ఈ ఇంటి ద్వారాలు నీకోసం ఎప్పుడూ తీసే వుంటాయి. ఈ ఇంటిలోని మనుష్యులు ఎప్పటికీ నిన్ను అభిమానిస్తూనే వుంటారు." .... అంటూ లేచి లోపలికి వెళ్ళిపోయాడు.

తను గరికపాడు నుండీ వెళ్లే లోపల జానకి ఫలానా అని రాబట్టాలని కృతనిశ్చయురాలైన గాయత్రి అన్న గారి సమాధానంతో అప్రతిభురాలైంది. అభిమానం దెబ్బతిని కళ్ళల్లో నీరు పెల్లుబికింది.

(ఇంకా వుంది

# చండూర్ రచనలు

| | |
|---|---|
| నేటి విలువలు | పరిచయం చేసిన పుస్తకాలు |
| దూరాన్ని జయించిన మానవుడు | అన్యాయం |
| ఛార్లెస్ స్టీన్‌మెజ్ | ఆఖరి కోరిక |
| కథానికలు | ఎక్కడికి కమలా ? |
| జీవనమార్గం | భానుమూర్తి భార్య |
| ఎలినార్ రూజ్‌వెల్ట్ | రాధ నవ్వింది |
| తొలి పాఠాలు | కొత్తలోకాలు |
| ప్రేమగాథ | కొన్ని గ్రంథాలు |
| హెలెన్ కెల్లర్ | సీతతో సినీమాకు |
| డా॥ మేరి వెర్ఘీస్ | ప్రజానాయకుడు ప్రకాశం |
| నేల - నీరు | నట్టింట దీపం |
| మహా నగరంలో | మాంగుహూర్ మెయిల్ |
| జీవితం | మహాబలిపురం |
| నవచైనా | మనకీ ఒక కారు |
| ప్రతి గురువారం | సీతా ఫలాలు |
| ఆరు కథలు | భాష |
| చెట్లు | పూసల మేడ |
| మరొక ఆరు కథలు | శివరావు |
| ఈ నాగరికత | కలడో లేడో |
| నాలుగు రోడ్లు | మావో పాలనలో |
| అణుశక్తి | చైనాలో మైనారిటీలు |
| బాలరాజ్యం | అమెరికా |
| గ్రామ వైద్యుడు | జాతై నాలుగు |
| సాహస యాత్ర | వరదల్లో వాంగ్ |
| అంతేనా | మాతా భూమాతా |
| కాఫీ మానెయ్యడం | బీమలబారు |

వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలనుకున్న వారు మీకు చేరువలోవున్న లైబ్రరీ దొరికితే చదవండి.

# మద్రాసు



'ఆంధ్రప్రభ'తో ముప్ఫయ్యారేళ్ల అనుబంధం. 1959 లో 'ఆంధ్రప్రభ' డెయిలీ మద్రాసునుంచి విజయవాడకు తరలి వెళ్లింది. హైదరాబాదు, బెంగుళూరు, విజయనగరం ఎడిషనులు సంతరించుకొని, 1988 ఏప్రిల్ 29వ తేదీన, అయిదవ ఎడిషన్ మద్రాసునుంచి ప్రారంభించింది. ఆ పున రాగమన సందర్భంగా వెలువడిన ప్రత్యేక సంచికలోని వ్యాసం.

పల్లెలు, గ్రామాలు, బస్తీలు, పట్నాలు, నగరాలు, మహానగరాలు - ఈ విధంగా ప్రజలు నివశించే ప్రదేశాలకు పేర్లు పెడుతున్నాం. గ్రామాలు ఒకప్పుడు స్వయం సమృద్ధిగా ఉండేవని, పట్నం ప్రజ తమ స్వంత లాభం కోసం గ్రామీణ వ్యవస్థని ఛిన్నాభిన్నం చేశారని ఒక వాదం ఉంది. నగరం అనే మాట నుంచే నాగరికత, దాని వెంట సంస్కృతి, సంస్కారం యిత్యాదులు జనించాయని అంటారు. హస్తినాపురం, అయోధ్య వంటివి భారత రామాయణాల కాలానివైతే, వారణాశి, తక్షశిల, పాటలీపుత్రం యిత్యాదులు లిఖిత చరిత్రకు తెలిసిన కాలంలోనివి. పట్నమేలే ప్రభువు ఒకనాటి ప్రజకు విష్ణు సమానుడూ, ధర్మరక్షకుడూను.

గ్రీకు నాగరికత సిటీ స్టేట్స్ ద్వారా, వారి మధ్య ఎర్పడ్డ బాంధవ్యాల తోను, కలహాలతోను, ఊపిరి పోసుకు, అపురూప కళాసంపదను శిల్ప సౌభాగ్యాన్ని ముందుతరాల వారి కోసం మిగిల్చి కాలగతిలో కలిసిపోయింది. 'ఫ్రెండ్స్, రోమన్స్ అండ్ కంట్రీమెన్' అని ప్రజానీకాన్ని మూడు ప్రధాన వర్గాలుగా విభజించిన రోమన్ నాగరికత, సామ్రాజ్యాన్ని సుస్థిరం చేసుకు, సీజరు తప్ప మరొక దేవుడు ఉండటానికి వీల్లేదంది. జీసస్ చేసిన తప్పిదమేమిటంటే, సీజరు గాక మరొక దేవుడున్నాడనటమూ, ఆయన ఆత్మ సామ్రాజ్య ప్రభువు అనటమూను!

రోమన్ సామ్రాజ్యం రోమ్ మహానగరాన్ని అంటిపెట్టుకు వృద్ధి జెందింది - దశదిశలా వ్యాపించింది. అప్పట్నుంచీ మనకు పట్నాలను అంటిపెట్టుకు విస్తరించిన ప్రభుతలూ, ప్రభుత్వాలే కనిపిస్తున్నాయి. థేమ్స్ నది మీద ఉన్న లండన్‌ది గాని, సేన్ నది మీద ఉన్న పారిస్‌దిగాని,

నైలునది మీదున్న అలెగ్జాండ్రియాది గాని, యమునా నది మీద ఉన్న ఢిల్లీది గాని, హుగ్లీ నది మీద ఉన్న కలకత్తాది గాని కొన్ని వందల సంవత్సరాల చరిత్ర. ఫ్రెంచి నాగరికత పారిసియనులను వేరు గాను, ప్రావెన్స్‌లో వారిని వేరుగాను పేర్కొంటుంది. వర్తక వాణిజ్యాలలోను, ద్రవ్యాధికారంలోను, సంగీత సాహిత్యాలలోను, లలిత కళలలోను పారిస్‌లో ఉన్న ఫ్రెంచి వారికి గల ఆసక్తి, అభినివేశం గ్రామీణ ప్రాంతాలలో వారికి ఎలా ఉంటుంది? ఉండగల అవకాశమెక్కడ? పట్నాలు, తమ అధికార ప్రాబల్యంతో, గ్రామీణ ప్రాంతాల పై తమ ప్రభావం చూపుతాయి. ఫ్రెంచి మహావిప్లవ కాలంలో లిబర్టీ, ఈక్వాలిటీ, ఫ్రెటర్నిటీ అనే మాటలు పారిస్ నగర వీధులలో వినిపించాయి గాని మారుమూల గ్రామాలలోను, సామాన్య బస్తీలలోనూ కాదు. గత ఏడెనిమిదేళ్ళగా ఇరాన్, ఇరాక్‌ల మధ్య జరుగుతున్న యుద్ధాన్ని టి వి లో చూస్తున్నాం. పేపర్లో చదువుతున్నాం. కాని, ఫ్రాన్సూ, ఇంగ్లండూ వంద సంవత్సరాల పాటు యుద్ధం చేసిన విషయం ఈనాడు ఎందరికి గుర్తు? అలాగే తమ సామ్రాజ్యాల కోసం ప్రతి వలస దేశంలోనూ వారిద్దరూ పోరాడారు. అయితే, ఈ యుద్ధాలకీ ఈ రాజకీయ ప్రభంజనాలకీ అతీతమైన స్వరూపాన్ని వ్యక్తిత్వాన్ని లండన్, పారిస్ నగరాలు సంతరించుకున్నాయనే విషయం ఎవరు కాదనగలరు? అందుకే కావచ్చు ప్రఖ్యాత జర్మన్ సాహిత్యకారుడు, గొథె, మహాపట్నాలకు ఆత్మలు ఉంటాయని అన్నాడు

సూరత్ నుంచి వ్యాపారం ప్రారంభించిన ఆంగ్లేయులు నెమ్మది నెమ్మదిగా కలకత్తాలోను, మద్రాసులోను కోటలు కట్టుకున్నారు. కోటలు ఎందుకంటే, తమ సరుకు భద్రపరుచుకొనేందుకు, అత్యధిక సంఖ్యలో ఉన్న నేటివుల నుంచి ఆత్మరక్షణ కోసమూను. వెంకటగిరిరాజా వద్ద నుంచి చెన్నడు పొందిన ఈ బెస్తపల్లె సామ్రాజ్య విస్తరణలో నౌకాయానానికి గల ప్రాముఖ్యత వల్ల, చెన్నపురి చెన్నపట్టణము అయింది. ఆంగ్లేయులు ప్రారంభంలో తమ పాలనా సౌలభ్యం కోసం మూడు ప్రావిన్సులు ఏర్పరుచుకున్నారు - కలకత్తా, మద్రాసు, బొంబాయి. విశ్వవిద్యాలయాలు స్థాపించినది కూడా అక్కడే - రైలు మార్గాలు (ఇనుప దారులు) వేసినదీ ఆ పట్టణాల మీదు గానే! గాంధీగారి నాయకత్వాన దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడినది బ్రిటిష్ ఇండియాలోని ప్రజలు మాత్రమే - కొన్ని స్వదేశ సంస్థానాలలోని వారు తమ సంస్థానాధీశునితో పోరాటం సాగించారు - అది వేరే విషయం. ప్రభుత్వ వైఖరిపట్ల తమ నిరసనని, ముక్కు మీద గుద్దినట్లు ప్రభుత్వానికి ఎలా చెప్పడమా అని గాంధీజీ తికమక పడుతున్నప్పుడు, 'హర్తాళ్' అనే మాటని, ఆ పిలుపుని, సమస్తాన్ని సంఘీభూతం చేయగల ఒక కొత్త ఆయుధాన్ని - అహింసా సమరంలో

అద్వితీయమైన ఆయుధాన్ని - మద్రాసు కాథెడ్రల్ రోడ్‌లోని తమ నివాస గృహంలో బాపూజీకి సూచించారు రాజగోపాలాచారి. ఇప్పుడు 'బంద్' అంటే సర్వసామాన్యమూ వేళాకోళమూ అయిపోయింది గాని, జలియన్‌వాలా బాగ్ దురంతల తర్వాత, రాజాజీ సలహాపై గాంధీగారు వాడిన ఈ 'అహింసాయుత ఆయుధం' విస్మయం కలిగించేటంత ఫలితాన్ని యిచ్చి ఆ నాటి ప్రభుత్వాన్ని బెదరగొట్టింది. ఆ మహాయుధం అవతరించినది మద్రాసులోనే.

కలకత్తా, ఢిల్లీ, బొంబాయి, మద్రాసు - ఈ నాలుగూ మన దేశంలోని మహా నగరాలు. కర్ణాటక సంగీతానికీ, కూచి పూడి, భరత నాట్యాలకు, దేవాలయ శిల్పసంపదకు, అవిచ్ఛిన్న దాక్షిణాత్య సంస్కృతీ వాహినికీ ప్రతీక మద్రాసు మహానగరం. ప్రపంచం మొత్తం మీద అరవై సూపర్ సిటీస్ (మహానగరం) ఉన్నాయి - అందులో మద్రాసు ఒకటి.

పదిపదిహేనేళ్ళ వయసులో మొదటి సారి మద్రాసు స్టేషన్‌లో దిగి, వాల్ టాక్స్ రోడ్డుమీదకి వచ్చినప్పుడు, ఆ ట్రాముల గలగలలో, ఆ శబ్ద రవళిలో ఒక వినూత్న గానం వినిపించింది. ప్రజలు తమ తమ పనులమీద చక చకా పోవడం, ఆ కదలికలో ఆ చైతన్య స్రవంతిలో నా కంతదాకా తెలి యని జీవస్పందన గోచరించింది. ఇటు వంటి మహాపట్నంలో సెటిల్ అవాలని ఆ చిన్న వయసులోనే నా మనసున గటిగా నాటుకుపోయింది. 'ది డికయిన్ అండ్ ఫాల్ ఆఫ్ ది రోమన్ ఎంపైర్' అని పదిహేడు సంపుటాలు వ్రాసిన 'గిబ్బన్' ప్రతిభలో సహస్రాంశం కూడా నాలో లేదు గాని రోమ్ పట్టణాన్ని ఒకనాటి సంధ్యారుణ కాంతులలో చూసి, ఎలా ఆ పట్టణాన్ని ప్రేమించి నదీ చదివినప్పుడు, నా చిన్ననాటి స్మృతి తటుక్కున మెరిసింది.

మనకి ఒక కోరిక ఉండగానే సరి గాదు - అది నెరవేరగల పరిస్థితులు వొనగూడాలి - అనుకూల వాతావరణం సమకూడాలి. ఆరంభంలో ఆకాశవాణి, ఆ తర్వాత ఆంధ్రప్రభ వీక్లీ, అనువాద రచనలు, ఆంధ్ర మహిళాసభ - యిలా అధ్యాయాల వారీగా మా జీవితాలు ముందుకి సాగాయి. సారస్వత పత్రికగా ప్రారంభమైన 'మాలి' - శ్రీశ్రీ, బుచ్చి బాబు, రజని, జనమంచి రామకృష్ణ గోపీచంద్, కుటుంబరావు, ఆరుద్ర మున్నగువారి రచనలతో అలరారిన 'మాలి' - కాలావసరాలని బట్టి 'జగతి' గా మారి, గత ముప్ఫయి మూడేళ్లుగా పరిమిత సంఖ్యలోని పాఠకులకు మంచి మాట చెబుతోంది. చందూర్ దంపతుల వ్యక్తిత్వ వికాసానికీ, విస్తృత జీవితానికీ, సారస్వత కృషికీ ఈ మహానగరం దోహదకారి అయింది - ఎందరో సన్మిత్రులను సన్నిహిత పరిచింది. మాలతీ చందూర్ 'ప్రమ దావనం' ప్రారంభించి ఈ ఆగస్టుకి ముప్ఫయ్యారేళ్లవుతుంది. ఈ మహదవ కాశం కల్పించినది 'ఆంధ్రప్రభ' యాజ మాన్యమూ, సంపాదకులుతో బాటు మద్రాసే! మద్రాసంటేనూ,. యిక్కడి.

సంస్కృతీ, ఈ జీవన విధానమూ అంటేనూ మా కెంతో యిష్టం. మమ్మల్ని తీర్చిదిద్దింది ఈ మహానగర్ - మా జీవితాలకు వెలుగునీ, తృప్తినీ యిచ్చింది ఈ మద్రాసు.

చాలా సంవత్సరాల క్రితం మంజరీ ఈశ్వరన్ (ప్రఖ్యాత ఆంగ్ల రచయిత) ఎగ్మూరు వోవర్ బ్రిడ్జి వద్ద తటస్థ పడ్డారు. హాల్స్ రోడ్‌లోని తమ ఇంటికి తీసుకువెళ్లారు. ఇంటి ముందు 'వేదవిలాస్' అని బోర్డు ఉంది. 'ఈ ఇంట్లో ఎవరుండే వారో చెప్పుకో గలరా?' అని అడిగారు. తెలియ దన్నాను. 'రాజమండ్రి నుంచి తరిమి వేయగా, కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఈ ఇంట్లో ఉండేవారు' - అన్నారు.

అలాగే మొక్కపాటి నరసింహ శాస్త్రిగారు ఒకసారి యడ్మిరాలిటీ హౌస్‌కి తీసుకువెళ్లి, 'యిక్కడ ఎవ రుండేవారో తెలుసా?' అని అడిగారు. తెలియదని చెప్పాను. 'గురజాడ అప్పారావుగారు' - అన్నారు.

అంతదాకా ఎందుకు మొన్నీమధ్య రామినీడు షష్ట్యబ్ది ఉత్సవ సంద ర్భంగా మోటూరి హనుమంతరావు గారు, ఆంధ్ర రాజకీయ రంగంలో కమ్యూనిస్ట్ ఉద్యమం కోల్పోయిన యువతకు, మద్రాసు తెలుగు సినీ పరిశ్రమ ఆశ్రయమిచ్చిందనీ, వారు తమలోని సంచలనాత్మక భావాలను వెండి తెర ద్వారా ప్రజలలోకి తీసుకు వెళ్లగలిగారనీ చెప్పారు.

పొట్టి శ్రీరాములు భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణం కోసం ప్రాణాలు ధారపోశారు. అయితే, ఆ గాంధేయ వాది స్వభాషాభివృద్ధి ద్వారా జాతీయత బలపడుతుందనుకున్నారు. కాని, ఆచరణలో అది ప్రాంతీయతా వాదానికి దారితీసింది. అనేక కొత్త సమస్యలు తెచ్చిపెట్టింది. మహా నగరాలెప్పుడూ భాషా పరిమితులకు, రాజకీయ ప్రభావాలకు అతీతమైన ఆర్థిక సౌష్టవం కోసం, వివిధ పరి శ్రమలతోను, వర్తక వాణిజ్యాలతోను ప్రగతి మార్గాన పయనిస్తాయి. ఒకప్పుడు ఓడరేవులు, ఆ తర్వాత రైల్వే జంక్షనులు - మచిలీపట్నాన్ని మరిపించింది విజయవాడ; విజయ నగరాన్ని వెనక్కినెట్టింది విశాఖ పట్టణం; ఇప్పుడు విమానాశ్రయాలు. సరుకు ఓడలో వచ్చినా, రైలులో వచ్చినా, ఆ సరుకు అమ్మేమనిషి విమా నంలో వస్తాడు. ప్రతి ఎల్లెకీ పరి శుభ్రమైన మంచినీళ్ళు కావాలని చెబుతున్నా, కార్టన్స్‌లో వచ్చే సాఫ్ట్ డ్రింక్ కాదనలేము. ఆర్థిక లావా దేవీలన్నిటికీ కీకలస్థానం మహానగరం. స్కయ్‌స్క్రాపర్సు సంపదతో బాటు స్లమ్స్ పెరగవచ్చు కాని, వాటిని కొంతలో కొంత అదుపులో పెడతారు.

మన నాలుగు మహానగరాలలో ఒకటైన మద్రాసుతో తెలుగువారి చరిత్ర, సంస్కృతి ముడివడి వున్నాయి. ఒకప్పుడు రోమ్‌లో ఇరవై రెండు భాషల ప్రజలు ఉండేవారట. మన మద్రాసులో గాని, ఢిల్లీలో గాని ఇంగ్లీషు గాక

నాలుగైదు భాషలు మాట్లాడేవారు మాత్రమే కనిపిస్తారు. స్వభాష ఇంట్లో మాట్లాడుకోవచ్చు గాని వ్యావహారిక భాషలు రెండు మూడు కంటే సాధారణంగా ఉండవు. కాగా, 'రూపాయి'కి విలువే తప్ప భాష తెలీదు.

మద్రాసుకి సాంస్కృతికంగా ఒక ప్రత్యేకత ఉంది. రసిక రంజని సభలో ప్రదర్శన యిచ్చి మెప్పించగలిగితేనే నాట్యకళాకారిణి (పద్మా సుబ్రహ్మణ్యం చెప్పారు). మ్యూజిక్ అకాడమీలో గుర్తింపు పొందితేనే సంగీత విద్వాంసుడు. నారద గాన సభ, కృష్ణ గాన సభ, శంకరాభరణం, శ్రీనివాసశాస్త్రి హాలు, కళారంజని, కళాసాగర్, కళా భారతి, మద్రాసు తెలుగు అకాడమీ, మాక్స్‌ముల్లర్ భవన్, యలైన్స్‌ఫ్రాంకె, అమెరికన్ సెంటర్, సోవియట్ కల్చరల్ సెంటర్, మద్రాసు లిటరరీ సొసైటీ (అపూర్వ గ్రంథాలకు) యిలా ఎన్నో ఎన్నెన్నో వున్నాయి. మాకు తెలిసిన పదిపేర్లు చెప్పాను తెలియని వింకెన్నో! అడయారులోని థియొసాఫికల్ సొసైటీకి గాని, తిరువాన్మయూర్‌లోని కళాక్షేత్రకు గాని వెళ్తే మరొక ప్రపంచంలో అడుగుపెట్టిన అనుభూతి కలుగుతుంది.

మద్రాసంటే మైలు రాళ్ల పుట్ట. ఇది నిత్య నూతనమూ రస భరితమూ అగు మహానగర్. తొమ్మండుగురు రాష్ట్రపతులలోను నలుగురు ఈ మద్రాసు నుంచి ఢిల్లీ వెళ్లినవారే (రాధాకృష్ణన్, వివి గిరి, నీలం సంజీవరెడ్డి, ఆర్. వెంకట్రామన్). పాతికేళ్లుగా మద్రాసు నుంచి తెలుగు దినపత్రిక లేదు - ఆ లోటు యివ్వాళ తీరుతోంది.

—యన్నార్ చందూర్

'ఆంధ్రప్రభ'కు కృతజ్ఞలతో

## మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటాయనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ప్రచురణ నిమిత్తం పంపే రచనలతోబాటు పోస్టుబిళ్లలు అతికించిన పొడుగు కవరు వుంటేకాని అంగీకారం కానిది వెనక్కి పంపడం సాధ్యం కాదు. మా ఊళ్లో 'జ గ తి' దొరకడం లేదనేవారికి ఒక్కటే మనవి - చందాదారులుగా జేరమని! రెండు సంవత్సరాలకి, అంటే 24 సంచికలకు, నలభైఅయిదు రూపాయిలు.

JAGATI Monthly, 2, Kutchery Road, P.B.2922 - Madras - 600 004.

## చిత్రజగతి

# సమీక్షలు

## పియఫ్ డివిజన్ 'అన్నా - చెల్లెలు'

మాధవ్ (శోభన్‌బాబు), రాజశేఖర్ (శరత్‌బాబు) యిద్దరూ నేషనల్ మెడికల్ ఇన్‌స్టిట్యూట్‌లో పనిచేసే డాక్టర్లు. మాధవ్ భార్య రాధ (రాధిక), రాజా భార్య జ్యోతి (జీవిత) యిద్దరూ కోర్టులో ప్రాక్టీస్ చేసే లాయర్లు. మేజరుగారి (గుమ్మడి) కోడలైన జ్యోతికి నాలుగేళ్ల అబ్బాయి వున్నాడు; రాధ ఒక అమ్మాయిని కని ఈ బాంధవ్యం దృఢతరం చేయవలసి వుంది. రోజూ ఈ నలుగురూ, రెండు ఫియట్ల బదులు ఒకే ఫియట్‌లో మొదట కోర్టుకీ, ఆ తర్వాత హాస్పిటల్‌కీ వెళ్తూ వుంటారు. హాస్పిటల్ ఛీఫ్ (ప్రభాకర రెడ్డి), ఉన్నత వైద్యవిద్యకై అమెరికాకు వెళ్లే ఛాన్సు రాజాకి రాగా, రాజా కోరిక మీద ఆ అవకాశం మాధవ్‌కి వచ్చేటట్టు చేస్తాడు. ఈ రహస్యం మిత్రుడూ బావగారూ అయిన మాధవ్‌కి తెలియనీయ వద్దని కోరుతాడు రాజా. ఢిల్లీ వెళ్తున్నానని చెప్పిన మాధవ్, రాజాని బ్లాక్‌మెయిల్ చేస్తున్న ఒక లారీ డ్రయివర్‌తో (అతని వుంపుడుకత్తె ఒకప్పుడు రాజాకి ఫ్రెండ్) అకవుంట్ తెముల్చుకునేందుకు ఢిల్లీ బదులు బెంగళూరు ప్రయాణమవుతాడు .... దుర్మార్గుడైన గిరి మాధవే రాజాని చంపాడని జ్యోతికి సైతం నమ్మకం కలిగేటట్టు చెప్పగా కోర్టుసీనులూ, వాద ప్రతివాదాలూతో ప్రధాన సాక్షి అయిన లారీ డ్రయివర్ని ఈ మాధవ్ ప్రతీకార చర్యగా హత్యగావించిన ఉదంతం వెల్లడవుతుంది. ఈ చిత్రంలోని డాక్టర్లు డాక్టర్లూ కాదు; లాయర్లు లాయర్లూ కాదు. సగటు హీరో హీరోయినులు. దర్శకత్వం: రవి రాజా పినిశెట్టి. నిర్మాతలు: సుబ్బారావు, రవీంద్ర బాబు

## శ్రీనివాసా వారి '... మాయగాడు'

మనోహరూ (కృష్ణ), దివ్య (శ్రీదేవి) వికలాంగుల ఆశ్రమంలో మూగవాళ్లుగా చేరుతారు.... ఎవరిదో పసిబిడ్డను హత్యాప్రయత్నం నుంచి తప్పించేందుకు, ఆ బిడ్డ తల్లిగా మూకత్వం నటిస్తూ ఈ ఆశ్రమ రక్షణ పొందుతుంది దివ్య. తండ్రి

(బాలయ్య) ఆత్మహత్య చేసుకోగా, బావగారికి కట్నం బకాయిచెల్లించి, చెల్లెలు కాపరం నిలబెట్టేందుకూ, మేన మామ (నూతన్‌ప్రసాద్) కూతుర్ని కట్టుకోవలసివచ్చే ఉపద్రవం నుంచి బయట పడేందుకూ, పేరు మార్చుకు మూగవానిగా చేరుతాడు ఈ అశ్రమంలో కథానాయకుడు. ఇరువురూ మూగవాళ్లుకాని కారణంగా ఉద్యోగాలు ఎగిరిపోతాయి. అయితే బ్రతుకు తెరువు కోసం, ఈ పసివాణ్ణి కాపాడేందుకు, ఈ యిరువురూ 'ఆనందా' వారు నిర్వహిస్తున్న ఆదర్శదంపతులు పోటీలో పాల్గొని, ఒక లక్షకి బదులు అయిదు లక్షలు నెగ్గుకుంటారు. ఈలోగా కాసిన్‌కన్నీళ్లు, కొంచెం దెప్పుకోవడం, మేనమామ వేట. ఆ మేనమామ కూతురు (జయమాలిని) అయిదు నక్షత్రాల హొటల్ బిచ్చగానిని (శుభలేఖ సుధాకర్, మనసార ప్రేమించడం, ఆస్తి కోసం పసివాని అసలు తండ్రి హత్య గావింపబడటం, ఆ బాలుని బాధ్యత ఈ నవదంపతులపై పడటంతో చిత్రం ముగుస్తుంది..... శ్రీదేవి తన నటనా వైదుష్యంతో ప్రేక్షకులని ఆనంద డోలికల వూగిస్తుంది. దర్శకత్వం : విజయ బాపినీడు. నిర్మాత : అట్లూరి రాధాకృష్ణ మూర్తి.

## యస్పెస్ వారి 'అగ్నికెరటాలు'

సూర్యంబాబు (కృష్ణ) దీన జన బాంధువుడు - జైలునుంచి విడుదలవుతున్న అతని కోసం పూలమాలతో నిలబడతారు పేద ప్రజలు. అలాగే ఆడపిల్లలకు కసరత్తు, కరాటె నేర్పి, తమ మహిళా సమాఖ్య ద్వారా అన్యాయాలని హాకీ బాట్స్‌తో ప్రతి ఘటిస్తూ వుంటుంది హేమ (భానుప్రియ). తమ గ్రూప్‌లోని ఒక కవితకు నెల తప్పగా, ఆ వంచకుని వెతికి పట్టుకు ఈమెకు అతనితో పెళ్లి జరిపించాలనే కృత నిశ్చయంతో వున్న ఈ సుందరాంగులు, సూర్యమే ఆ దోషి అనుకొని, అతనిని ఒక గదిలో బంధిస్తారు. 'పూల చెండ్లలావున్న ఈ తాళ్లని యిట్టే తెంపుకోగలను - కాని, మీరు నన్ను యిలా ఎందుకు కట్టేస్తున్నారో నాకు బోధపడకుండా వుంది - అని చెప్పే ఈ హీరో, కొద్ది సేపయాక, ఆపదలోవున్న ఈ లతివలని ఆదుకోవలసివస్తుంది. చూపులు కలుస్తాయి, వలపులు వెల్లువవుతాయి. విలన్ నాగేంద్ర (నూతన్‌ప్రసాద్) కూతురు హేమకీ, కథానాయకుడు సూర్యానికీ, కళ్యాణ ఘడియ తోసుకొచ్చేలోపున రాజేశ్వరీదేవి (అంధురాలైన అడ్వకేట్ — శారద) పధ్నాలుగేళ్ల నాటి పగ చల్లారుతుంది - తన స్వంత కొడుకు అయిన సూర్యం, చంద్ర (పోలీసు ఇనస్పెక్టరు - శ్రీధర్)

సహకారంతో! అవినీతి ధన బలమూ వల్ల న్యాయానికి కళ్లు మూసుకు పోతా యని చెప్పే మరొక చిత్రం. దర్శకత్వం: తాతినేని రామారావు. నిర్మాత : శ్యామలా రెడ్డి

## భానుమతి నటించిన 'అన్నపూర్ణమ్మగారి అల్లుడు'

ఏడుకొండలవాని భక్తురాలైన అన్నపూర్ణమ్మ (భానుమతి), బ్రహ్మ కడిగిన పాదం కీర్తిస్తూ, భజగోవింద శ్లోకాలు పారాయణ చేస్తూ, అల్లుని (రాజశేఖర్) మంచితనం కాదనకుండా, అతనిలో ఆస్తికత్వం దైవభక్తి ఎప్పుడు కలుగుతాయా అని ఎదురు చూస్తూ వుంటుంది. కాబోయే అత్తగారి వొంటి మీద నగలు, దొంగలు దోచుకోబోతు న్నప్పుడు, గాలిలోనుంచి వూడిపడ్డ రాజేంద్ర, మాంచి ఫైటింగ్ జరిపి, ఈమెని ఈమె నగలనీ కాపాడుతాడు, అక్షరాలా గాలిలోనుంచి వూడిపడటం కాదు - చేరువలో ఒక చెట్టు నీడలో నిద్రిస్తున్నప్పుడు శేషావతారం (పాము) వచ్చి, యితనికి మెలకువ తెప్పించగా, దొంగలు అన్నపూర్ణమ్మ గొంతుక పొడిచే సమయానికి, యితను ప్రత్య క్షమై ఆమెని కాపాడతాడు. తల నీలాలు అర్పించేందుకు తిరుపతి వెళ్లి, కారు ప్రమాదంలో మరణించిన మిత్రుడు, తగు వైద్యం లేక వైకుంఠ ఏకాదశి నాడు ప్రత్యూషానికి ముందే ఆలయానికి వెళ్లి, తీర్థం పుచ్చుకు మెట్ల మీద నుంచి దొర్లి మరణించిన తల్లి, ఈ రాజేంద్రని విగ్రహారాధనకి విముఖుని చేస్తాయి. శ్రామికుని స్వేద బిందువులో దేవుడున్నాడనీ, వర్క్ ఈజ్ వర్షిప్ అనీ ఆత్మస్థయిర్యంతో పలికే హీరో, అత్తగారి ప్రభావం వల్ల వెంకటేశ్వరస్వామి భక్తుడవుతాడు. ప్రేక్షకులు ఆదరించ వచ్చుగాని పాములతో మాజిక్కులు జరిపే ప్రగతి నిరోధక చిత్రం.

## లక్ష్మీ ప్రొడక్షన్స్ 'ఆడదే ఆధారం'

ఇరుగు. పొరుగువారి సమస్యలలో తల దూర్చి, వారి కష్టాలు కడ తేర్చ డమే జీవితాలంబనగా గల రేడియో మామయ్య (విసు) వంటివారు మనక క్కడక్కడ కనపడకపోరు. ఇతని జగత్కళ్యాణ సేవ కారణంగా, సంపా దిస్తున్న కొడుకు (చంద్రమోహన్) ఆరేసి నెలల కొకసారి యిల్లు మార వలసి వస్తుంది. తండ్రిగారి సంఘ సేవా చింతనను యింటి యజమానులు ఎంత మాత్రం హర్షించలేక ఖాళీచేయ మంటారు; మళ్లీ వీరు మరొక కాలనీకి మారుతారు. భార్య చనిపోగా, కొడుకూ కోడలూమీద పూర్తిగా ఆధారపడ్డ ఈ రేడియో మామయ్య, కొడుకుని సూటిగా ఎదిరించడు, ఎదిరించలేడు; బితుకు బితుకు మంటూనే, కొడుకుని తప్పించుకు తిరుగుతూనే, తను అను కున్నది సాధిస్తాడు. కోడలికి మామ గారి పట్ల సానుభూతి ఉంటుంది; అలాగే మనుమరాలికీ ఉంటుంది; కాని, దిప్పకాయ మనుమడు మాత్రం తాత మీద ఒక కన్నేసి వుంచు

తోడు .... వరకట్నం, మద్యపానం, వెర్రితలలు వేసే స్వాతంత్ర్యం - ఈ మూడిటికీ ప్రతీకలయాయి పాత్రలు. చదువుకున్న కోడలు మామగారి మీద దొంగతనం కట్టి, అయన మరణానికి కారకురాలవుతుంది ఒక యింట్లో; మరొక యింట్లో కోడలు యబార్షన్ కై అనేక జిత్తులు పన్ను తుంది అత్తగారు. తాగుబోతు తండ్రీ కొడుకుల పార్టు కూడా సమంజసంగా లేదు. ఏమైనప్పటికీ ఫైట్స్లూ, క్లబ్ డాన్సులూలేని కుటుంబగాథా చిత్రం. దర్శకత్వం : విసు ; నిర్మాత : పూర్ణ చంద్రరావు.

## అంజనా వారి 'త్రినేత్రుడు'

అభిమన్యు (చిరంజీవి) ఒక ఇన స్పెక్టరు; ఏ బ్రాంచికీ చెందక సాము గరిడీలు, కరాటె కసరత్తులూ నేర్చి, కండలు పెంచి, అరివీరభయంకరుడై, విజృంభించేసిల్వర్‌స్క్రీన్ ఇనస్పెక్టరు. కాన్వెంటులో చదివే తన తమ్ముడు బ్రవున్ షుగర్‌కి బానిసై మరణించాడు. ప్రాణభీతితో పారిపోయివచ్చి తన శరణు జొచ్చిన మిత్రుని (చంద్ర మోహన్) డిడి ముఠావారు దారు ణంగా హత్య చేశారు ; డాక్టరు ప్రత్యూష (భానుప్రియ) సమాచారం క్షుణ్ణంగా తెలుసుకునేందుకు నాలుగు నెలలు సెలవు పెట్టి గోవా వెళ్ళిన కలియుగ అభిమన్యుకి, అ ప్రత్యూష తమ్ముడు కూడా బ్రవున్ షుగర్ కోర ల్లో చిక్కుకున్నాడని తెలుస్తుంది. మంచి వాడనుకున్న అంకుల్ ముఖర్జీ (రంగనాథ్) సైతం డిడి ముఠా వ్యక్తే వైజాగ్‌లోని డియస్పి(మురళీమోహన్), గోవాలోని ఐజి (సత్యనారాయణ) అభి మన్యుని ఈ కత్తులబోనులో తలదూర్చ వద్దని వారిస్తారు. డిడి, లోకం దృష్టికి దీనదయాళువు ; అసలువ్యక్తి, హాస్పి టల్‌లోని రోగులని పనిగట్టుకు చంపించి, చీల్చికుట్టిన వారి గర్భ కోశాల్లో 'నార్కొటిక్స్' పెట్టి కోటాను కోట్ల లాభానికి విదేశీయులకి అమ్మే డేర్‌డెవిల్ - పరమ నికృష్టుడు .... గోల్డెన్ ట్రయాంగిల్ గురించిగాని, క్రిసెంట్ ట్రయాంగిల్ గురించిగాని, నార్కొటిక్స్ నడిచేదారులగురించిగాని కించిత్ అవగాహనకూడా లేకుండా క్రయిమ్ డిటెక్షన్‌కిగల అత్యాధునిక సౌకర్యాలకు అతీతునిగా సినిమా హీరోని చిత్రిస్తూ, లవ్‌సాంగ్స్‌తో నడిచే పిక్చరిది. దర్శకులు; కోదండ రామిరెడ్డి. నిర్మాత ; నాగేంద్రబాబు

## సంతోష్ వారి చూపులు కలిసిన శుభవేళ ....

పాండు రంగం (వీర భద్రరావు అన్నగారి కూతురు పద్మ (అశ్వని),) అయిదగుడుల అరంగుళాలు వుండే తమ ఆఫీసు మేనేజరుని (మోహన్) ప్రేమి, స్తుంది. ఆ మేనేజరు ఎవరయ్యా అంటే సంస్కృత పదభూయిష్టమైన తెలుగు లో మాట్లాడే ఒక జమిందారుగారి (కోటశ్రీనివాసరావు) కొడుకు ! తన కుమారునికి అశ్వారోహణరాకపోవడం తమ వంశానికే తలవంపులని బాధపడే

జమీందారాయన. చిన్ననాటి ఫ్రెండు ప్రసాద్ (నరేష్), నందిగామలో సైకిలుషాపు సవ్యంగా నడపలేక, బ్యాంకు వారి నోటీసులకు బెదిరి. ఆత్మహత్యా ప్రయత్నంలో ముమ్మారు, విఫలుడు కాగా, మేనేజరు మోహన్ అతనిని తీసుకొచ్చి, తన యజమాని పాండురంగానికి పరిచయం చేస్తాడు; వాకింగ్ సరదాగల పాండురంగం, ఆప్రసాద్‌కి ఉద్యోగమిస్తాడు. పట్నం పిల్ల లలితని (సంధ్య) ప్రేమించిన ప్రసాద్, అజ్ఞాత ప్రేమికునిగా ఆమెని ఆకట్టుకోగలుగుతాడుగాని కొన్ని అటంకాలు ఎదురవుతాయి. పద్మా మోహనుల ప్రేమ వివాహం, విచిత్రవేషాలు కట్టే పాండురంగం అన్నగారికి (నూతన్‌ప్రసాద్) నచ్చదు — ప్రేమలూగీమలూ ఆయన తత్వానికి పడవు. అంచేత, మరికొన్ని మలుపులూ, నాటకీయతతో దర్శకులు జంధ్యాల, మనని మరింత నవ్విస్తారు. హాయిగా ఆనందించ గల చిత్రమిది. నిర్మాత; యమ్మెస్‌రెడ్డి.

## ఉషాకిరణ్ వారి 'ఓ భార్య కథ'

అతను (చంద్ర మోహన్) ఒక ప్రయివేటు కంపెనీలో అతని సామాన్యమైన ఉద్యోగి; ఆమె (జయసుధ), ముగ్గురు పిల్లల తర్వాతకూడా జాగర్త తీసుకోకపోతే ఎలా అని భర్తని అదుపులో ఉంచే వివేకవతి. ప్రొమోషన్ కోసమై ఎదురుచూసే అతనికి, సేట్ అల్లుడు (శరత్‌బాబు) తమ యింటికి భోజనానికి రావడం వరప్రసాదమవుతుంది భార్యా భర్త లిద్దరినీ గెస్ట్ హౌస్‌కి ఆహ్వానిస్తాడతను. భార్యను ఆ సేట్ అల్లుడుకి వొప్పగించే స్వభావ నైచ్యం అతనిలో ఉందిగాని, ఆమె మొదట్లో ఎదురు తిరిగి, చివరికి భర్త మాట, భర్త కోసం శిరసావహిస్తుంది. అయితే, పాటిల్ (సేట్ అల్లుడు) ఈమెను పిలిపించినది 'పడకగది' లాలసతో కాదు; ఈమె ముమ్మూర్తులా తన భార్యను పోలివున్నది; తన భార్య ఒక ఆడపిల్లను ప్రసవించి అమెరికాలో చనిపోయింది; ఆ దుర్వార్త చావుబతుకుల మీదనున్న మామగారికి తెలియనివ్వలేదు; తెలిస్తే ఆయన గుటుక్కుమంటాడు. అంచేత ఆ కోటీశ్వరుని ప్రాణాలు కాపాడేందుకు, లేదా, ఆయన మనశ్శాంతితో కన్ను మూసేందుకూ, ప్రేమా పాటిల్‌గా బొంబయి వెళ్తుందామె. ముగ్గురు పిల్లలతల్లి ఒక ధనవంతునితో లేచి పోయిందనుకుంటారు ఇరుగు పొరుగు. పాటిల్ మంచితనం ఆధారంగా తీసుకుని, అతని వద్దనుంచి నేర్పుగా డబ్బు రాబడుతూ, శివరామ్ ఎమ్మెల్యే అవుతాడతను. తన ప్రయోగం వల్ల ఒక సుఖసంసారం విషపూరితమయిందనీ, ఒక నారీ హృదయం అగ్ని గోళమయిందనీ తెలుసుకుని, మనస్సంక్షోభంతో ఆత్మహత్య చేసుకుంటాడు పాటిల్. ఈమె ఐశ్వర్యవంతురాలిగా, ప్రేమాపాటిల్‌గా మిగిలిపోయి, వివిధ భాషలలో వెలువడే స్త్రీ అనే పత్రిక ద్వారా వనితాభ్యుదయానికి పాటు పడుతూం

టుంది. అయితే, సినిమా క్లయిమాక్స్‌కి కావల్సిన మాతృత్వ న్యాయంతో, కూతురు పెళ్ళీ, తనకోసం ప్రాణాల ర్పించిన కొడుకు మృతీ చూసి, మళ్ళీ బొంబయి వెళ్ళిపోతుంది. జయసుధ పెర్ ఫారమెన్స్ బాలా గంభీరంగా, ప్రశంసనీయంగా ఉంది. దర్శకత్వం: మౌళి. సమర్పణ: అట్లూరి రామా రావు ; నిర్మాత : రామోజీరావు.

## పద్మాలయా వారి 'ముగ్గురు కొడుకులు'

ధర్మారావు దంపతుల (గుమ్మడి - అన్నపూర్ణ) సంసారం బృందావనమై మమతాను రాగాలతో వర్ధిల్లుతున్న సమయంలో, నిజాయితీ పరుడైన ఆ ఫారెస్ట్ ఆఫీసరు, ఇరువురు రేంజర్ల వల్ల (నూతనప్రసాద్ - కోటశ్రీనివాస రావు) వంచింపబడి, స్మగ్లర్ భాను మూర్తి (సత్యనారాయణ) కారణంగా పదకొండేళ్లపాటు జైలు పాలవుతాడు. ఉరుములూ మెరుపుల వర్ష రాత్రిలో తుఫాను బీభత్సంలో తల్లీ పిల్లలది తలో దారీ అవడంతో, పసివాడు సురేంద్ర (మహేష్) మట్టుకే తల్లినంటి పెట్టుకు వుంటాడు. పెద్దవాడు ఫణీంద్ర (కృష్ణ) గొప్ప స్మగ్లరై, అవినీతి అర్జ నను పేదలకు పంచి పెడుతూంటాడు. రెండోవాడు రాజేంద్ర (రమేష్) ఒక డీయస్పి దంపతుల యింట (మురళీ మోహన్ - ప్రభ) పెరిగి పెద్దవాడవు తాడు. నిర్మలమనస్సుతో ఫణీంద్ర రాజేంద్రకు కానుకగా యిచ్చిన శివాజీ విగ్రహంలో కుత్రదారులు డైమండ్స్ వుంచడం, అందువల్ల డియస్పి అరెస్ట్ కావడం ప్రదాన కథాంశం. రోజా (రాధ) సోదరుని, రహస్య పత్రాల కోసం విలనులు బందించి వుంచారు. ఆ బంధితుని వెలుపలకి తెచ్చి, భాను మూర్తికి బుద్ధిచెప్పడం పణీంద్ర కర్త వ్యం. దుష్టత్రయాన్ని కుమారత్రయం బాహు బలవిక్రమ పరాక్రమాలతో ఎ దుర్కోని, తలి దండ్రులని కలిపి, మధుపర్కాలతో (పెద్ద పిల్లలిద్దరూ - మూడో అబ్బాయికి గర్ల్ ఫ్రెండ్ వుందిగాని పెళ్లి వయస్సు యింకా రాలేదు) శుభం చెబుతారు. దర్శ కత్వం : కృష్ణ. నిర్మాతలు : హనుమం తరావు - ఆదిశేషగిరిరావు.



మానవుని మెదడు బాలా గొప్పది. పుట్టినప్పట్నుంచీ అది విరామం లేకుండా పనిచేస్తూ వుంటుంది — ఒక్కక్షణం కూడా ఆగదు, ఉపన్యాసం యిచ్చేందుకు వేదిక ఎక్కినప్పుడు తప్ప !

—హాఫ్‌మాన్

నన్నడిగితే సంభాషణా పరున్ని రెండు రకాలుగా విభజించవచ్చు. ఎదుట వారు చెబుతున్నది శ్రద్ధగా వినేవారు ఒక రకం ;వారు అలా చెబు తూవుండగా తాము వినదలుచుకున్న ఛలోక్తి గురించి ఆలోచించేవారు మరొకరకం.

—బిల్విన్






## 1988 సెప్టెంబరు 04

సదరన్ రయిల్వే సీనియర్ కమర్షియలాఫీసర్ యస్ చక్రధరరావు దంపతుల కుమార్తె సౌ ॥ గౌతమికి, నాదెళ్ల వెంకట నరసయ్యా దంపతుల కుమారుడు చి ॥ ప్రతాప్‌కీ, ఉదయం 11గం ॥ 45 ని ॥ లకు దక్షిణ భారత హిందీ ప్రచార సభవారి మహాత్మా గాంధీ కాన్వొకేషన్ హాలులో శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. ఇరవై ఏళ్లుగా తెలిసిన సన్మిత్రులు చక్రధరరావు. మంచితనానికి మారుపేరాయన. ఒక్కసారి పరిచయమైనవారికి తెలుస్తుంది ఆయన ఎటువంటి సౌజన్యమూర్తో ! నిన్న ఆంధ్రాబంద్ — ఎక్కడి రైళ్లు అక్కడ ఆగిపోయాయి. అయినప్పటికీ పెళ్లివారు వున్న సర్కార్ ఎక్స్‌ప్రెస్ మాత్రం, ప్రయారిటీతో ఎనిమిదిన్నరకి సెంట్రల్‌లోకి వచ్చింది ; మగ పెళ్లివారు తొమ్మిది గంటలకు విడిది చేరుకున్నారు. పెళ్లికొడుకు చేత మంగళ స్నానం చేయించి, సరిగ్గాసమయానికి కళ్యాణ మండపానికి తీసుకువచ్చారు .... సూత్రధారణ అయాక, హాయిగా భోంచేసి యింటికొచ్చిన మాకు అనాడు తెలియదు ఈ విషయం! రెండుమూడు రోజులు పోయాక ప్రసంగవశాన టివికె శాస్త్రి చెప్పారు. 'చక్రధరరావుగారి మంచితనమే ఆయనకి మేలుచేసింది అనుకున్నాం .... .... మంచితనం' నిజ జీవితంలో ఎలా శోభిస్తుందో, ఎంతటి ఉపకారం చేస్తుందో చాలా మందికి తెలీదు. తెలిసిన కొద్దిమందిలో చక్రధరరావు ఒకరు .... గౌతమీ ప్రతాప్‌లకు మా శుభాశీస్సులు.

## . . . . . 05

హీరోల కుమారులూ, నిర్మాతల కుమారులూ సినీరంగ ప్రవేశం గావించి కొత్త వరవడి ఏర్పరుస్తున్న కాలంలో, రాజేంద్రప్రసాద్ కుమారుడు 'జగపతి బాబు' 'సింహస్వప్నం'తో పరిచయం కానున్నాడు, 'జగపతిబాబు' అందగాడు (హాండ్‌సమ్) ; ఆమాట అతనికి అన్ని విధాలా అతుకుతుంది. రూపానికి తగ్గ విగ్రహమూ, భావ స్ఫూర్తి వెదజల్లే నేత్రద్వయమూను. వాహినీ మూడోఫ్లోర్‌లో జగపతి ఆర్‌పిక్చర్స్

వారి 'సింహస్వప్నం' మూహూర్తానికి చిరంజీవి క్లాప్ యివ్వగా తాతినేని రామారావు కెమెరా స్విచాన్ చేశారు దర్శకత్వం : మధుసూదనరావు : నిర్మాత : రాజేంద్రప్రసాద్ ....జగపతి బాబు పరిచయమయే ఈపిక్చర్లో, కృష్ణంరాజు — జయసుధలతో బాటు రంగనాథ్, గిరిబాబు, త్యాగరాజు, వినోద్, వాణి, హంస, అనిత మున్నగు వారున్నారు. చక్రవర్తి సంగీతం — ఆచార్య ఆత్రేయ పాటలు. సంక్రాంతి నాటికి విడుదల కావచ్చు 'సింహ స్వప్నం' . . . . . . విజయాగార్డెన్స్ డీలక్స్ రికార్డింగ్ థియేటర్‌లో యస్సార్ ఫిలిమ్స్ వారి 'మంచి కుటుం బం' పాటలముహూర్తం. కృష్ణ, శారద ముఖ్యులుగా గల ఈచిత్రానికి దర్శ కులు : రామ్మోహనరావు ; నిర్మాత : రామచంద్రరావు, మొత్తం ఆరు పాటలు. పరుచూరి బ్రదర్స్ కథ. 'ఇల్లూ కన్నతల్లీ — మాకు రెండు కళ్లమ్మా' అనే ఈచిత్రం కూడా, రాజ్ - కోటి సంగీతంతో, సంక్రాంతికి విడుదల చేయాలను కుంటున్నారు .... పి ఆర్ ఒ రాజు విజయాకి తీసు కొస్తే, పి ఆర్ ఒ జగన్ ఎవియమ్‌లో ఎంతోసేపు పట్టదన్నారు. ముత్యాల సుబ్బయ్య దర్శకత్వంలో భగీరథ ఆర్ పిక్చర్స్ వారి ప్రథమ చిత్రం.... 'ఓటు వేయమంటాడు - నోటు చేతికి స్తాడు - మాట మూట గడతాడు - మత్తులోనె బెడతాడు' (జాలాది గేయం - గాత్రం : వందేమాతరం శ్రీనివాస్, లలితా సాగర్). రాజశేఖర్, రావు గోపాలరావు, రజని, సాయికుమార్ మున్నగు వారున్నారు. చక్రవర్తి సం గీతం. నిర్మాత : ఎయమ్ రత్నం.... గ్రహగతుల రీత్యా 'యివ్వాళ మంచి రోజుకాబోలు - అందుకని ఈ ఉదయం మూడు ముహూర్తాలు.

. . . . . 06

'తెలుగు మహిళ తెలుసుకోవె - వెనుక అడుగు వేయబోకె - అదిశక్తివై ధైర్యలక్ష్మివై - ఆత్మరక్షణ దుష్ట శిక్షణ చేయాలి' (వేటూరి రచన - జానకి గాత్రం) అంటూ షార్ట్స్‌లో కసరత్తుచేస్తూ, దేహసౌష్టవం ప్రద ర్శించే ఇరవైమంది డాన్సర్లు (భాను ప్రియ, రాజ్యలక్ష్మితో బాటు) హెచ్చ రిక చెబుతారు, యస్పెస్ ఫిలిమ్స్ వారి 'అగ్ని కెరటాలు' లో.... వదిహేను మంది పాల్గొనే మరొక డాన్సులో హీరో కృష్ణ, హీరోయిన్ భానుప్రియ తో 'నువ్వే నాజున్ను ముక్క - నీకేలే ఆకు వక్క - నీతోనే చెమ్మచెక్క' (వేటూరి గీతం - బాలు గాత్రం) అని కవ్విస్తాడు.... 'తగులుకుంటే తగిన దాన్ని నాసామి - పగలు రేత్రి లేని దాన్నిరో' - అని మురిపిస్తుంది జయ మాలిని గొల్లపూడి, గిరిబాబులని (పాట : వేటూరి : కంఠం : జానక్పి బాలు). 'ఎక్కడికి పోతాడు చిక్కడిన చిన్నోడు' అనీ, 'పడగెత్తే నాగన్న పగబట్టే నాగన్న' అనీ, నాగపూజ గురించి, మరో రెండు సాంగ్సూ వున్నాయి. మొత్తం అయిదూ వేటూ రివే! పరుచూరి బ్రదర్స్ రచన -

చక్రవర్తి సంగీతం. శారద, శ్రీదుర్గ, సంజీవి, నూతన్‌ప్రసాద్. శివకృష్ణ, రంగనాథ్ మున్నగు వారున్నారు. దర్శకత్వం : తాతినేని రామారావు ; నిర్మాత : శ్యామలా రెడ్డి ; సమర్పణ : రామకృష్ణారెడ్డి. మీరిది చదివే నాటికి పిక్చర్ రిలీజై వుంటుంది.

. . . . . 07

గీతా ఆర్ట్స్ వారి పద్మాలుగవ చిత్రానికి విజయా గార్డెన్స్‌లో ప్రారంభోత్సవం. చిరంజీవి లాయరు డ్రస్‌లో కెమెరా ముందు నిలబడగా, ఆయన కుమారుడు క్లాప్ యిచ్చాడు ; నిర్మాత అల్లు అరవింద్ కుమారుడు స్విచాన్ చేశాడు. ఈ చిత్రానికి యిద్దరు చిరంజీవులు ప్రారంభోత్సవ కర్తల వడం ఒక విశేషం. విజయశాంతి హీరోయిన్ ; వాణిశ్రీ అత్తగారు. రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, సత్యనారాయణ, సుధాకర్, గిరిబాబు, రంగనాథ్, వేలు, బ్రహ్మానందం, అన్నపూర్ణ మున్నగు వారున్నారు. దర్శకత్వం : కోదండరామిరెడ్డి. వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం. సిమ్లా, డార్జిలింగ్‌లలో పాటలను చిత్రీకరింపమన్నట్లు తెలిపారు నిర్మాత అల్లు అరవింద్. ప్రెస్ మీట యాక, ఏడాది తర్వాత కలుసుకున్న వాణిశ్రీతో నాలుగు మాటలు మాట్లాడి, గబగబా యింటికొచ్చాను - ఎందు కంటే, పదకొండున్నరలోపున బయలు దేరి వెళ్లాలి.... భానుమతీ రామకృష్ణ పుట్టినరోజు యివ్వాళ ! పొద్దుట

వైవిధ్య రోవిస్సుల విశాల సుసంపన్న జీవితాన్ని దర్శింప జేసే గవాక్షాలు మహాపట్నంలోని ఆర్ట్‌గాలరీలు, మ్యూజియమ్‌లు.

1951 నవంబరు 27



బయలు దేరుతున్నప్పుడే చెప్పింది మాలతి, పన్నెండు లోపున మనం వెళ్లాలని ! పదకొండున్నరకి పూజ అయిపోతుందనీ, పన్నెండు లోపున కాసేపు కూచునేటట్టు రమ్మనీ చెప్పారట. సరిగ్గా టైముకి వెళ్లాం - అప్పుడే పూజ ముగించుకు వచ్చారామె. వయసుతో వచ్చిన స్థౌల్యంతప్ప, ఏభైఏళ్ల సినీజీవితం ఆమె సుందర విగ్రహాన్ని ఏమీ మార్చలేదు సరిగదా ముఖవర్చస్సు ద్విగుణీ కృతమయింది. జంకు గొంకు లెరుగని కళామూర్తి ఆమె ; మనసులో మాట నిర్భయంగా చెప్పే విదుషీమణి. మాయింట్లో అందరికీ అపురూపరాలామె. 'మెనీ హాపీ రిటర్న్స్' చెప్పి పాయసమూ వడలూ తిని, లోకాభిరామాయణం ముచ్చటించి, యింటికి చేరుకొనేసరికి దగ్గర దగ్గర రెండయింది.... వస్తూవస్తూ దారిలో రామలక్ష్మి అరుద్రకి 'బాన్ వోయేజ్' (ఈ రాత్రి స్టేట్స్ వెళ్తోందామె - కూతురు దగ్గిరికి) చెప్పి వచ్చాము. పాపం, డ్రయివర్ జోసఫ్‌కి యివ్వాళ భోజన సమయం మించి పోయింది - పొద్దుట్నుంచీ స్టీరింగ్ వద్దనే ఉన్నాడు. శారదని స్కూలు నుంచి తీసుకొచ్చాక మళ్లీ సాయింత్రం

మాక్స్ ముల్లర్ భవన్ వారి నూతన గృహప్రవేశానికి వెళ్లాలి.... "రాజకీయ సామ్రాజ్యకాంక్ష ముమ్మరంగా ఉన్నరోజులలో, భావసామ్రాజ్య వ్యాప్తి ద్వారా ఆధ్యాత్మిక నైతిక విలువలు నెలకొల్పేందుకు కృషి చేసిన మహాను భావుడు మాక్స్ ముల్లర్. ప్రాచీన భారత సంస్కృతిని పాశ్చాత్యఖండ ప్రజలకు పరిచయం చేసిన ఘనత ఆయనది," - అన్నారు తమిళనాడు గవర్నరు అలెగ్జాండర్, ఖాదర్ నావాజ్ ఖాన్ రోడ్‌లోని (13), మాక్స్ ముల్లర్ భవన్ వారి నూతన గృహప్రవేశ సందర్భంగా! మాక్స్ ముల్లర్ భవన్‌కి మన దేశంలో ఏడు కేంద్రాలున్నాయి. జర్మన్ సంస్కృతికీ, భారతీయ సంస్కృతికీ మధ్య నృత్య, సంగీత, సాహిత్య, చిత్ర కళల ద్వారా మైత్రీలత అల్లడం, ఈ కేంద్రాల ప్రధాన లక్ష్యం. మద్రాసులోని ఈ కేంద్రం డైరక్టర్ 'హాన్స్ - డీటద్ - ఎమ్మర్ట్' ఆహూతులకు స్వాగతం తెలుపగా ఢిల్లీ కేంద్రానికి చెందిన ప్రధాన డైరక్టర్ ఇంగా - రాట్ ఈ భవనం తమకు యిచ్చిన సినీ ఆర్టిస్ట్ శోభన్‌బాబుని అభినందించారు. కళాక్షేత్రకు, మాక్స్ ముల్లర్ భవన్‌కిగల పరస్పర బాంధవ్యం గురించి చెప్పారు శంకర మీనన్. మద్రాసులోని జర్మన్ కౌన్సల్ జనరల్ మిసెస్ వోజెల్, దక్షిణ భారతానికి 18వ శతాబ్దంలో వచ్చిన జర్మన్ విద్యావేత్తల గురించి ప్రస్తావిస్తూ, ఇండియా జర్మనీలు రెండూ భావనా జగతిని ఏవిధంగా విస్తృత పరిచేదీ వివరించారు. అక్కమ్మా అలెగ్జాండర్ జ్యోతి వెలిగించగా, గవర్నరు అలెగ్జాండర్ కొత్త భవనంలో అడుగు పెట్టారు .... ఆ తర్వాత సంగీత కార్యక్రమం.

. . . . . 09

పసి పిల్లల బృందగాన నృత్యాలెప్పుడూ పసిడి వెలుగులు వెదజల్లు తాయనేందుకు, యివ్వాళ మ్యూజిక్ అకాడమీలోని ఎంటర్‌టైన్‌మెంట్ ఒక ప్రత్యక్షనిదర్శనం. నదురూ బెదురూ లేకుండా, తమకు తెలిసిన విద్య ప్రదర్శించి మెప్పించాలనే ఆ లేత మనసులు మనని అవలీలగా ఆకట్టుకుంటాయి. చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు వారి యూనివర్స మ్యూజిక్ అకాడమీలో - విజిపి గ్రూప్ ఛెయిర్‌మాన్ సంతోషం ఈ నాటి కార్యక్రమానికి అధ్యక్షులు. 51 ఏళ్ళవయసుగల ఈ స్కూలు, మైలాపూరులోని ఒక ఆదర్శ విద్యాకేంద్రం - కీర్తి కాయులైనశర్మ దంపతుల సజీవచిహ్నం.

. . . . . 11

'ప్రాణస్నేహితులు' అన్నితరగతుల వారికీ నచ్చిన శుభ సందర్భంగా కాస్మొపాలిటన్ క్లబ్‌లో కృష్ణంరాజు ప్రెస్ మీట్. "ఆనాటి 'కృష్ణవేణి' నుంచి ఇప్పటిదాకా ప్రతి చిత్రంలోను పాత్రోచిత న్యాయం సమకూరుస్తూనే వున్నాను. కొన్ని చిత్రాలు అద్భుత విజయం పొందడానికీ, మరికొన్ని అంతగా ఆదరణ పొందలేకపోవడానికీ కారణాలు అనేకం.... సుధాకరరెడ్డి

(కళ్యాణీఫిలింస్) నన్నుఒకవిధంగా నిలబెట్టారు. సామాజికులను సంతృప్తి పరుస్తూ, ప్రజాబాహుళ్యానికే దూరం కాకూడ దంటారాయన (క్లాస్ అండ్ మాస్).... పత్రికలవారు నన్ను మొదట్నుంచీ అభిమానిస్తున్నారు. వారితో కాసేపు మాటా పలుకూచెప్పుకునేందుకే ఈ సమావేశం" - అన్నారు కృష్ణంరాజు. ఆ ఇష్టాగోష్టిలో రెండుగంటలు రెండునిముషాల్లా దొర్లిపోయాయి.

. . . . . 12

అమెరికన్ లిటరేచర్, ఇంగ్లీషు లిటరేచర్, జర్మన్ లిటరేచర్, రష్యన్ లిటరేచర్, ఇండియన్ లిటరేచర్ - యిలా వినడమే గాని 'అమెరికన్ ఇండియన్ లిటరేచర్' అనే మాట నేను యింత దాకా వినలేదు - అది నా అజ్ఞానం. .... 1910 నాటి జనాభా లెక్కల ప్రకారం అమెరికాలో 2లక్షల 10 వేల మంది ఇండియనులు వుండేవారట ; 1980 జనాభా ప్రకారం 14 లక్షల 18 వేలు ; వీరిలో సగం మందికి పైగా, అంటే సుమారు ఏడున్నర లక్షలు, పట్నవాసాలలో ఉంటున్నారు. వంశపారం పర్యంగా కంఠస్తమై వున్న వీరి సాహిత్యం (Oral Literature) 19వ శతాబ్దంలో వెలుగులోకి వచ్చింది. మొట్ట మొదటి అమెరికన్ ఇండియన్ సాహితీకారుని పేరు సామ్సన్ ఒక్కామ్ (Samson Occom 1723 - 90). 19వ శతాబ్దంలో చాలా మంది వ్యాప్తిలోకి వచ్చారు ; 20వ శతాబ్దంలో అమెరికన్ ఇండియన్ లిటరేచర్ ఒక సాహిత్య విభాగమయింది. కంఠోపారంగా ఉన్నవి లిఖిత రూపం దాల్చాయి. 'ఫర్ దోజ్ హు కమ్అఫ్టర్' ('For Those Who Come After Arnold Krupal) వంటి పుస్తకాలు ఈ సాహిత్య సరణిని మరింత వెలుగులోకి తీసుకువచ్చాయి. 'కాలిగోళ్ళ నేల మీద తివాచీని, చేతిగోళ్ళ అందని గాలినీ పటుకుంటూ వుంటే, అది అనంత సీమలో నా విశ్వవిహారమనిపిస్తుంది' — అని రాల్ఫ్ సాలిస్‌బరీ (Ralph Salisbury), యివ్వాళ అమెరికన్ సెంటర్లో తన కవిత ల్కావిడక్కడ ఉదహరిస్తూ ఉపన్యసికంనప్పుడు, ఒక కొత్త గళం వినిపించింది ; ఒకకొత్త లోకం కనిపించింది.

. . . . . 13

'ది రైటర్స్ క్లబ్'| Madras - Convenor : Dr PR Joy వరల్డ్ పొయెట్స్ ఇంటర్నేషనల్ (World Poets - International... Krishna Srinivas)అదర్స్ గిల్డ్ ఆఫ్ ఇండియా మద్రాసు ఛాప్టర్ (The Authors Guild of India - Madras Chapter ... SVS & D Anjaneyulu) అమెరికన్ సెంటర్ (The American Centre - Madras, వీరు నలుగురూ కలిసి వుడ్‌లాండ్స్‌లో రాల్ఫ్ సాల్స్‌రిబ Ralph Salisbury పొయిట్రీ రీడింగ్ ఏర్పాటు చేశారు . . . . . సమావేశ ప్రారంభానికి పూర్వం, సాల్స్‌బరితో, 'నిన్న మీరు అమెరికన్ సెంటరులో సర్కిల్ విషయం ప్రస్తావించారు. ఈ ఉపమానం మా సంస్కృతిలో సర్వ సామా-

న్యమైనది. సంసార వలయం, జీవన చక్రం — యిలాటి మాటలు మేము నిత్య కృత్యలలో కూడా అంటూ వుంటాము. సంసార వలయం నుంచి వెలుపలకి వచ్చి (మానసికంగా) వీక్షిస్తే తప్ప, తత్త్వస్వరూపం అవగతమవదంటారు ...." — అన్నాను ఆయన కామెంట్ వినే కుతూహలంతో.

"అవును — ఇండియన్ ప్రొఫెసర్స్ చెప్పారు నాకావిషయం. 'సర్కిల్'కి మొదలూ తుదీ లేదు. ఆ రెండూ తెలుసుకోవాలనే ఆరాటమే మన అన్వేషణ — అందులో ఒక అంశ మన పొయిట్రీ" — అన్నారు సాల్స్ బరీ. .... స్వాగత వచనం, పరిచయ వాక్యాలూ అయాక సాల్స్ బరీ తన పొయట్రీ చదివి వినిపించారు. "ద్రాక్షతోటలోని దెయ్యం, ఇంద్రధనువుని వేలెట్టి చూపిస్తూ, జలాశయ సమీపానికి, శ్వేత హరివిల్లు" యిత్యాది కవితా సంకలనాలు వెలువరించిన సాల్స్ బరీ కవితా పఠనం చేశారు. "మనందరం ఆకాశంలో బతుకుతున్నాం - ప్రతి మనసూ రెండు కుటీరాల సంగమం. ఒకటి నిజరూపం, మరొకటి ప్రతిబింబం ఈ రెండూ




జమ్మి వారి

# లివర్ క్యూర్

పసిబిడ్డలకు యేర్పడు కామెర్లు (జాండీస్) ఆకలి లేమి, మలబద్ధకము, మలము తెల్లగాపోవుట, మూత్రము విసర్జించినచోట తెల్లగ మరకకట్టుట— మొదలైనవి లివరు వ్యాధి సూచనలగును.

ఈ వ్యాధిని నిర్మూలించుటకు 'జమ్మి' వారి డాక్టరును సంప్రదించండి.

ప్రతినెలా వారి డాక్టరు మీ ఊళ్లకు వచ్చెదరు.

జమ్మి ఫార్మస్యూటికల్స్

'జమ్మి బిల్డింగ్స్'

61 రాయపేట హైరోడ్డు మద్రాసు - 600 004 ఫోన్ నెం. 72539

భూమధ్యరేఖవద్ద కలుసుకు, మంచులా కరిగిపోతున్నాయి ... మా నాన్న కాల్చే పైపులోని అగ్నికణం, ఉల్కలా తోచేది నాకు .... ఔత్సాహికులు పాడతారు, నిష్ణాతులు మౌనరాగంతో నివేదిస్తారు .... కొందరికి తమతో జీవితం పంచుకొనే భార్య కంటె పరమాణువుల (యాటమ్స్) గురించి ఎక్కువ తెలుసు .... నా పదిహేనవ జన్మదినంనాడు వెలిగించిన కాండిల్‌ని మెరుపుతో వెలిగించాను - అదింకా వెలుగుతూనే ఉంది .... చర్చిగంటలే కదా గుండెలకు రాగ తాళలయల నిచ్చేది ...." - అంటూ సాల్స్‌బరీ తన కవితా ప్రసూనాలు చల్లారు. జస్టిస్ మోహన్, రాల్ఫ్ సాల్స్‌బరీకి జ్ఞాపిక నంద చేయగా, తమిళనాడు ప్రభుత్వ అడ్వయిజర్ పద్మనాభన్ (ఆయన చక్కటి కవి - 'రెయిన్‌డ్రాప్స్') సాల్స్‌బరీ కవితలోని ఆర్ద్రతనీ, సౌకుమార్యాన్ని ప్రశంసించారు .... రాల్ఫ్ సాల్స్ బరీ కవితను ఆయన ముఖతా వినే అవకాశం మళ్లీ కలగక పోవచ్చు. కాని, ఆయన కవితా విపంచి మాత్రం మనని నక్షత్ర గానం వినమంటుంది.

. . . . . 15

గాంధీక్షేత్రం యమ్ వి కృష్ణారావు గారికి ఈ నెల ఆరో తేదీన 'వి హెచ్ యస్' లో న్యూరోసర్జన్ రామ్మూర్తి అపరేషన్ చేశారు. సున్నితమైన శస్త్ర చికిత్స అవడం వల్ల నాలుగైదు రోజుల పాటు విజిటర్లు రాకపోకలని కట్టడి చేశారు. నాలుగోతేదీన చూశాము - కాసేపు రాజకీయాలూ సాహిత్యమూ మాట్లాడి వచ్చాము. రెండు రోజులుగా వెళదామనుకుంటూనే వాయిదా పడుతూ వచ్చింది. ఇవ్వాళ ఉండ్రాళ్లతో (వినాయకచవితి) వెళ్లడం మంచిపని అయింది. ఎంచేతనంటే రేపు సాయింత్రము ఫ్లయిట్‌లో ఆయన హైదరాబాదు వెళ్లిపోతున్నారు. మనిషి ఆరోగ్యంగా శుభ్రంగా ఉన్నారు. కృష్ణారావుగారనగానే రాజకీయ ప్రస్తావన రాకమానదు. తను 1957 లో, లోక్‌సభకి ఎలా ఎన్నుకోబడినదీ, ఆ వెనుకటి వృత్తాంతం రసవత్తరంగా చెప్పారాయన. ఒక గంటసేపు అక్కడ కూచుని, దారిలో రమణయ్య రాజా యింటి వద్ద ఆగాము. మామూలుగా అయితే ఎనిమిదిన్నర దాకా వొదిలేవారు కాదు గాని, 'యివ్వాళ రాజసులోచన పుష్పాంజలి కార్యక్రమంలో యన్ టి ఆర్, కరుణానిధి మాట్లాడుతున్నారు' - అని చెప్పేసరికి, 'అయితే వెళ్లిరండి' - అని పర్మిషన్ యిచ్చారు రాజా. అయిదున్నరకి మాలతిని యింటి వద్ద దిగబెట్టి, 'సద్గురు జ్ఞానానంద హాలు' (నారద గాన సభ) ఆరు లోపల చేరుకున్నాను ....రాజసులోచన నిర్వహిస్తున్న పుష్పాంజలి నృత్య కళా కేంద్రానికి పాతికేళ్లు నిండాయి. యివ్వాళ రజతోత్సవం. భరతనాట్యం లలిత వద్ద, కూచిపూడి వెంపటి చిన సత్యంవద్ద నేర్చుకున్న రాజసులోచన, ఆ యిరువురికీ తన కృతజ్ఞత తెలుపుతూ వారిని సత్కరించారు .వేదిక మీద కార్యక్రమాన్ని సియస్ రావు

నిర్వహించారు....'' ముప్పయ్యేళ్లు ఈ మద్రాసులో గడిచింది - నా జీవితంలోని ఫలవంతమగు కాలం ఈ కళామయ ప్రపంచంలో గడిచింది. ఏ అజ్ఞాత శక్తుల ప్రోద్బలం నన్ను రాజకీయాలలోకి తరిమిందో నాకు అంతుపట్టడం లేదు. అయితే, రాజకీయ రంగం ప్రవేశించాక, నా కర్తవ్యం నేను నెరవేర్చక తప్పదు.... నేను ప్రథమంగా భారతీయుణ్ణి. - తర్వాతనే తెలుగు పౌరుణ్ణి .... కేంద్రాన్ని పాలిస్తున్న రాజకీయ పార్టీ, రాష్ట్రాలలోని కాంగ్రెసేతర ప్రభుత్వాల పట్ల విచక్షణాయుతంగా ప్రవర్తిస్తున్నదన్న విషయం పట్లనే మా ఆక్షేపణ .... చైతన్యవంతమగు ప్రతిపక్షం ఆవిర్భవిస్తే తప్ప, మన ప్రజాస్వామ్యం పుష్టివంతమవదు.... ఎల్లుండి ఈ మద్రాసులో, ఏడు పార్టీల నేషనల్ ఫ్రంట్, తన ప్రణాళికను విడుదల చేస్తుంది....చిరకాల మిత్రులు డి యమ్ కె అధ్యక్షులు అయిన కరుణానిధి, మళ్లీ తమిళనాడు ముఖ్యమంత్రి అవ్వాలని మనసారా అభిలషిస్తున్నాను'' అన్నారు ఆంధ్ర ముఖ్యమంత్రి యన్ టి రామారావు - రజతోత్సవానికి దీపారాధన గావిస్తూ! డి యమ్ కె దృక్పథాన్ని, వారి ఆశయ లక్ష్యాలను వివరిస్తూ, విస్తృత ధ్యేయం కోసం యితర పార్టీలతో చేతులు కలుపుతామే తప్ప మా ఉనికినీ, వ్యక్తిత్వాన్ని విస్మరింపబోము - అన్నారు కరుణానిధి. ఆంధ్రప్రదేశ్ సమాచార మంత్రి దాడి వీరభద్రరావు 'పుష్పాంజలి' వారి సావనీర్ విడుదల చేశారు. యన్ టి ఆర్ తన గంభీరోపన్యాసంలో మరొక ఆసక్తిజనకమైన విషయం తెలిపారు. ''బృహనల పాత్ర వేయడానికి ఎవరూ ముందుకి రాలేదు. నేను వేస్తానన్నాను - అదొక ఛాలెంజిగా తీసుకున్నాను. వేదిక మీదున్న ఈ వెంపటి చిన సత్యంగారి కూచిపూడి ఆర్ట్ అకాడమీకి రోజూ ఉదయం నాలుగు గంటలకి వెళ్లి, ఒక గంటసేపు నాట్య విద్య అభ్యసించే వాణ్ణి - అలా మూడు నెలల పాటు నేర్చుకున్నాను. మీరందరూమెచ్చుకోవడమే గాకుండా ఖండాంతర ఖ్యాతి పొందింది 'నర్తనశాల' చిత్రం. సోదరి రాజసులోచనకే కాదు, నాకూ గురువుగారే వెంపటి చిన సత్యంగారు''....ఏనాటి 'నర్తనశాల'! 'బృహన్నల'పాత్ర వెనక ఎంతటి సుశిక్షణ! 'జీనియస్' అనగా ఒక శాతం యిచ్ఛాశక్తి, 99 శాతం క్రమశిక్షణ - అని థామస్ ఎడిసన్ చెప్పిన మాట అక్షరాలా నిజం! అందుకు ప్రత్యక్ష తార్కాణం మహామనీషి యన్ టి ఆర్.

..... 16

వేలం చేరిలోని 'హనీహవుస్' లో చిరంజీవి దీక్షావస్త్రాలలో ఉన్నారు. తన నూరవ చిత్రం రిలీజ్‌కి ముందు పత్రికల వారితో కాసేపు ముచ్చటించాలని 'లంచ్' ఏర్పాటుచేశారు..... ''ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్ విద్యార్థిగా నేను మొట్టమొదట బుక్ అయింది 'పునాది రాళ్లు' లో అయినప్పటికీ, వాసు దర్శ

కత్వంలో క్రాంతి కుమార్ నిర్మించిన 'ప్రాణం ఖరీదు' 1978 సెప్టెంబరు 22వ తేదీన వెండి తెర కెక్కింది. 1988 సెప్టెంబరు 22వ తేదీన, సరిగ్గా పదేళ్ల తర్వాత అదే నెల, అదే తేదీ నాడు, నా నూరవ చిత్రమైన 'త్రినేత్రుడు' రిలీజవుతోంది - మేముప్లాన్ చేసినది కాదు - యాదృచ్ఛికంగా జరిగిన ఘటనయిది! ఎందుకిలా సంభవించిందా అని తలుచుకొన్న కొద్దీ నాకే ఆశ్చర్యంగా వుంటుంది. నూరు చిత్రాలలో నటించడం గొప్పకాదు - మూడు వందలు, అయిదారువందలుచిత్రాలలో నటించిన ప్రసిద్ధులు వున్నారు. కథానాయకునిగా నా ఇమేజ్ పరిరక్షించుకోవడం ద్వారానే ఆర్థిక విజయం పొందగలుగుతున్నాను. అయితే, ఈ విజయం కళాకారునిలోని తపనని తృప్తిపరచలేదని మీకు తెలుసు. సినిమా నిర్మాణం వ్యాపార మవడం వల్ల వ్యాపార సూత్రాలు విస్మరించ కుండా సామాజిక చైతన్యానికి దోహద కారి అయ్యే పాత్రలలో రాణించాలనే తపన నాకూ వుంది. నాలుగు మూడు వ్యాపార చిత్రాల తర్వాత కళాత్మక లక్ష్యం గలది ఒకటైనా ఉండాలని నా ఆకాంక్ష ..... పదేళ్లు యింత వేగంగా గడిచిపోయాయా అనిపిస్తోంది" - అన్నారు చిరంజీవి యిష్టాగోష్ఠిగా. విజయ బాపినీడు ప్రసంగవశాన ఒకటి రెండు మాటలు చెప్పారుగాని. కోదండరామిరెడ్డి, సత్యానంద్ మాత్రం, పత్రికల వారి ప్రశ్నలూ చిరంజీవి సమాధానాలు వింటూ కూచున్నారు. పదేళ్ల నాటికీ యిప్పటికీ మరెంత బాధ్యత పెరిగిన నిండుకుండ చిరంజీవి.

. . . . . 17

ఫిబ్రవరిలోనో, మార్చిలోనో కాకినాడ లేడీస్ రిక్రియేషన్ క్లబ్‌వారు, తమ ప్లాటినమ్ జుబిలీకి ఆహ్వానిస్తూ మాలతీ చందూర్‌కి లేఖ వ్రాశారు; టెలిఫోన్ చేశారు. మాలతీ చందూర్‌లు బయట ఊరు ఎక్కడికి వెళ్లినా జంటగానే వెళ్తామనీ, తను ఒకర్తె ప్రయాణాలు చేసే అలవాటు లేదనీ, ఆనాటి ఉత్సవంలో పాల్గొనే యితర పెద్దలెవరో తెలుపమనీ ఆమె వద్ద నుంచి క్లబ్ ప్రెసిడెంట్‌కి జాబు వెళ్లింది. "ఆంధ్రా గవర్నరు కుముద్‌బెన్‌జోషీ, పోలీసాఫీసరు కిరణ్‌బేడీ ప్రమదావనం మాలతీ చందూర్" - ఈ ముగ్గురినే పిలుస్తున్నామని తెలిపారు. సరేనంది మాలతి.... కుముద్‌బెన్‌జోషీ సెలవు మీద అమెరికా వెళ్లడంతో ఆమె తిరిగి వచ్చాక పెట్టుకుందామనుకున్నారు ఫంక్షన్. ఆగస్టు మొదటి వారంలో వాణీ భాస్కరరావు (క్లబ్ వైస్ - ప్రెసిడెంట్) మద్రాసు వచ్చినప్పుడు చెప్పారు - సెప్టెంబరులో ఫంక్షనని! మొదట్లో పదకొండు అనుకున్నారు; ఆ తర్వాత పద్దెనిమిదో తేదీ ఖాయమయింది. కృష్ణాష్టమి నాడు (సెప్టెంబరు - 4) శ్రీలక్ష్మి స్వయంగా వచ్చి పిలిచి వెళ్లారు. మద్రాసు నుంచి టికెట్ల విషయంలో యిబ్బంది వుండదు; కాని, సామర్లకోట నుంచి మద్రాసుకి 19 వ తేదీ మెయిల్‌లో

రెండు ఎసి స్లీపర్లు కన్ ఫరమ్ చేయించ వలసిన భారం మీది' - అని శ్రీలక్ష్మి కి మళ్లీ గుర్తు చేశాను. మీకటువంటి యిబ్బందేమీ ఉండదు - అన్నారామె .... కాకినాడ లేడీస్ క్లబ్ కార్య వర్గం వారు, సామర్లకోటలో మమ్మల్ని బొకెలతో రిసీవ్ చేసుకోవడం నుంచి, మర్నాడు మమ్మల్ని రైలు ఎక్కించే దాకా, ఎంతటి ప్రేమాభిమానాలు కురి పించారో మాటలలో చెప్పలేము - చెబితే అతిశయోక్తి అనుకుంటారు. అది ఆతిధ్యం కాదు - అప్యాయత; గౌరవమర్యాదలు కాదు - స్నేహా మృతధార.... ఇవ్వాళ డి య మ్ కె ఊరేగింపు, ఏడుగురు పెద్దల నేష నల్ ఫ్రంట్ ఉత్సవం కారణంగా మవుంట్ రోడ్డూ, మెరీనా రెండూ జన సంకీర్ణమవడం వల్ల, ఎనిమిది గాక పూర్వం యింట్లో బయలుదేరి, తొమ్మిది దాటాక సెంట్రల్ చేరు కున్నాం. కంపార్ట్మెంటు కొంచెం చల్ల బడాక, పై బెర్తు ఎక్కి, హాయిగా నిద్రపోయింది మాలతి. ఇంకో పావు గంటలో ట్రయిన్ కదులుతుందనగా ఆదరాబాదరా వచ్చారు కటక్కి చెం దిన లోక్సభ మెంబరు దాసు - అయ నది నా కెదురుగా వున్న బెర్తే. జన మోర్చా పదకొండుగురిలో ఒకరైన దాసు, తాను యింతటి జనసాంద్రాన్ని ఎప్పుడూ చూడలేదన్నారు. 'ఇరవై పాతికేళ్లుగా మాకీ జనవాహిని కొత్త కాదు - ఇంత ప్రమాణంలో గాక పోయినా, రెండు మూడు నెలల క్రితం ఆదిపరాశక్తి ఉత్సవం కోసం అధిక సంఖ్యలో ప్రజలొచ్చారు. ప్రజను పట్నాలకు రప్పించి, జన సమీకరణ ద్వారా పార్టీ శక్తిని ప్రద ర్శించుకోవడం భారత రాజకీయాలలో ఒక భాగమై పోయింది' - అన్నాను. పన్నెండయే దాకా ఏవేవో మాట్లాడు తూనేవున్నాం.... ట్రయిన్ కృష్ణా వంతెన మీదకి రాగానే మెలకువ వచ్చింది. విజయవాడలో కాఫీ, నిడద వోలులో టిఫిన్! సామర్లకోటలో పూల గుత్తులతో స్వాగతం; రిసెప్ చేసుకో వడానికి ఏడెనమండుగురు వచ్చారు; నేను, మాలతీ - మరోయిద్దరు ముఖ్యులు ఏసి కారులో; మిగతావారు మరొక కారులో.

..... 18

కాకినాడ వస్తూండగా కారులోనే అడిగారు సీత; "మా మామయ్య (యస్ కె రావు) యింటికి మీ యిద్ద రినీ తీసుకువస్తానని చెప్పాను...." - 'సాయంత్రం మీటింగయాక వెళ్దాం' అన్నాను. యస్ కామేశ్వరావు ఐఎ యస్ (రిటైర్డ్)ని నాలుగైదేళ్ల క్రితం ఒకసారి చూశానుగాని పాతిక ముప్ఫ య్యేళ్ల క్రితం బాగా పరిచయం - జానకి రామ్గారి ద్వారా! రిటైరయాక ఆయన కాకినాడలో సెటిల్ అయారని తెలుసు. మాకు మేముగా చూదామను కున్నవారు యిద్దరే - ఒకరు: యస్ కె రావు; మరొకరు: భవానీప్రసాద్. యసక్ రావుగారింటికి సీత తీసుకు వెళ్తారు; డాక్టర్ భవానీ ప్రసాద్ పేరాజు పేటలో ఉంటున్నారు; రేపు

వుదయం వాకబుచేయాలి.... మునిసిపల్ గెస్ట్ హవుజ్‌లో మాకు బస ఏర్పాటు చేశారు. 'మీరు స్నానాలు చేసి, అరగంటా, ముప్పావుగటంలో రెడీఅవండి - పన్నెండు గంటలకి ఇష్టాగోష్టి ; ఒంటి గంటకు గవర్నరు గారితో లంచ్ - అటునుంచి అటే వెళ్తాం' - అని చెప్పి, మాతో వచ్చిన వారు వెళ్లిపోయారు. సరిగ్గా పావు తక్కువ పన్నెండుకి వారు వచ్చేసరికి మేము సిద్ధంగా ఉన్నాము.... మాలతీ చందూర్‌తో ఇష్టాగోష్టి - నూరూ నూటఏభై మంది వనితలు వేచి వున్నారు ఆ హాలులో.... మూడు తరాలుగా తనని ఆదరిస్తున్న పాఠకులకి కృతజ్ఞతలు తెలుపుతూ, ఏభైలలో ప్రమదావనం ప్రారంభించడం, వంటలు పిండివంటలు, కుట్లు అల్లికలు, నవలా పరిచయాలు, వనితా లోకానికి ఆ శీర్షిక పరిమితమై యితోధిక కృషి గావించడం, తను రాసిన నవలలు, తనకొచ్చే ఉత్తరాలు - వీటి గురించి ఒక పది నిముషాల పరిచయమయాక, 'యిష్టా గోష్టి' లో అనేకానేక విషయాలు దొర్లాయి - వరకట్నం, సతీసహగమనం, లిబ్ ఉద్యమం, ఉద్యోగం చేసే వనితల యిబ్బందులు, వారి పిల్లల పెంపకం, ఆర్థిక స్వాతంత్ర్యం - యిలా అనేకం, స్థానిక దిన పత్రిక అయిన 'సర్కార్ ఎక్స్‌ప్రెస్' ఈ 'ఇష్టాగోష్టి' లో అంశాలను హైలైట్ చేసింది. క్లబ్‌లో లంచ్. గవర్నర్ కుముద్ బెన్ జోషికి మా యిరువురినీ పరిచయం చేశారు. లంచ్ సమయంలోనే మిసెస్ యస్‌కె రావు పరిచయమయారు. ఒకామె ఎవరో వచ్చి నన్ను అడిగారు : మీరు ఏం చేస్తూ వుంటారని ! 'ఏమీ చేయను' - అన్నాను. 'మీకూ రాయడం వచ్చా ?' - అని ప్రశ్నించారామె. 'రాదు' - అన్నాను ... నేనలా చెప్పివుండకూడదన్నట్లు కొరకొరా చూసింది ఎవరో అమ్మాయి..... రెండున్నరకి గెస్ట్ హవుజ్‌కి వచ్చాం : నాలుగున్నరదాకా రెస్ట్ - అయితే నాలుగింటికే వాణీ భాస్కర్రావు యింట్లో నుంచి ఫలహారాలు వచ్చాయి.... అయిదు గంటలకు మిసెస్ యస్‌కె రావు తమ ఫియట్ డ్రయివ్ చేసుకుంటూ వచ్చి మమ్మల్ని క్లబ్‌కి తీసుకువెళ్లారు. వర్షభీతివల్ల షామియానాలో కాదని, మరొక బిల్డింగ్‌కి మార్చారు మీటింగ్. గవర్నరు క్లబ్ కొచ్చి ఇండోర్ స్టేడియమ్‌కి శంకుస్థాపన చేశాక అందరమూ మీటింగ్ జరిగే చోటుకి వెళ్లాం. హాలు కిటకిటలాడుతోంది. సభాధ్యక్షులు గవర్నరుగారు గనక మీటింగ్ సరిగ్గా టైముకి ప్రారంభమయింది.... పదకొండోతేదీ అయితే కిరణ్‌బేడీ వచ్చేందుకు అంగీకరించారట ; కాని, పద్దెనిమిది ఆమెకి వీలు కాలేదట. మమతా అనురాగ్ ఐపియస్, పద్మావతీ వుమెన్స్ యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ రాజేశ్వరి వస్తున్నారని ఇన్విటేషన్‌లో వేశారు ; కాని, కారణాంతరాలవల్ల వారు రాలేకపోయారు. ఇక, మిగిలినది యిద్దరే - ప్రధానవక్తగా మాలతీ చందూర్ ; అధ్యక్ష స్థానంలో ఆంధ్రా

గవర్నర్ కుముబెదన్ జోషి. క్లబ్ ప్రెసిడెంట్ యమ్ లక్ష్మి స్వాగత తెలిపారు; కార్యదర్శి నివేదిక చది వారు: ఆ తర్వాత మాలతిగారిని మాట్లాడమన్నారు. వేదిక లెక్కడం అలవాటులేని మాలతి గుండె ధైర్యం తెచ్చుకు మొదలెట్టింది. "సాధార ణంగా సభల్లో పురుషులు ఎక్కువ సంఖ్యలో ఉంటారు. కాని, ఇవ్వాళ యిక్కడ మాత్రం వారు మైనారిటీలో ఉన్నారు.... ఆంధ్రులకి మామిడి పళ్లంటే యిష్టం - ముఖ్యంగా ఈ ప్రాంతం చెరుకు రసాలకు ప్రసిద్ధి. మన ఆంధ్రా గవర్నర్ కుముద్ బెన్ జోషీగారికి ప్రశస్తమైన మామిడి తోటలు వున్నాయి గుజరాత్‌లో, ఆవి డకీ మామిడి పళ్లంటే ఎంతో యిష్టం .... 'లైట్ అండ్ సౌండ్' ప్రదర్శన ద్వారా ఇందిరాగాంధీ అంటే ఏమిటో తెలుగు వారికి తెలిసేలా చెప్పించారు కుముద్ బెన్‌జోషి. ఇందిరాగాంధీ వంటి మహోన్నత వ్యక్తి ప్రపంచ నారీ లోకానికే పూజనీయురాలు.... ఇక ఈ లేడీస్ రిక్రియేషన్ క్లబ్ రాజా రామ్మోహనరాయ్ వీధిలో ఉంది. అది గుర్తింప దగిన విశేషం. రాజా రామ్మోహనరాయ్, కందుకూరి వీరేశ లింగం పంతులు - వీరు చిరస్మరణీ యులు. 'ఆంగ్ల మానస భావాలుగల రఘుపతి వెంకటరత్నం నాయుడు వొద్దు, పిల్లలు చెడిపోతారు' అని పిఆర్ కాలేజి కమిటీవారు అనుకున్నప్పుడు, వారిని బలవంతాన వొప్పించి, నాయుడుగారిని ప్రిన్సిపాల్‌గా నియ మింప జేసిన ఘనత వీరేశలింగం గారిది. ఎప్పటి మాట? 1904లో! విజయనగరంలోని మహారాజా కాలేజి, కాకినాడలోని పిఠాపురం రాజా కాలేజి తెలుగు కళలకు సంగీత సాహి త్యాలకు చేసిన సేవ యింతా అంతా కాదు. ఇక వెంకటచలం, ఒక కృష్ణ శాస్త్రి, నాయుడిగారి చలవ వల్ల ప్రభా వితులైన వారేకదా!.... 'నాలుగణాల టికెట్ కొననిదే లోనికి వెళ్లనీయను' - అని జవహర్‌లాల్ నెహ్రూని నిలబెట్టిన పధ్నాలుగేళ్లమ్మాయి ఈ ఊరావిడే - దుర్గాబాయమ్మగారు.... టౌన్ హాలు లో గాక తను ప్రత్యేకంగా స్త్రీల సమావేశానికి వెళ్లి, విరాళం స్వీకరిం చడమేగాక వీధి ముఖం చూడని ఆ స్త్రీల జీవనరేఖను మార్చి వేశారు బాపుజీ ఈ ఊళ్లోనే.... కాకినాడ ఎంతో చరిత్రగల పట్నం. ఈ లేడీస్ క్లబ్‌వారు చేస్తున్న స్వచ్ఛందసేవ పేదల బతుకులలోకి వెలుగు తేగల దని ఆకాంక్షిస్తున్నాను ... నన్నెంతో పెద్దచేసి రప్పించిన ప్రెసిడెంట్ లక్ష్మి గారికి, కార్యవర్గ సభ్యులకు నా మనః పూర్వక వందనాలు. ఓపిగ్గా విన్న మీ అందరికీ నా కృతజ్ఞతలు" - అంటూ కరతాళధ్వనుల మధ్య ముగించారు మాలతీ చందూర్ తన ఉపన్యాసాన్ని.... "తెలంగాణాలోని జోగినుల జీవితం జాలికరమూ భయం కరమూను. వారిని ఆ బానిస బంధాల నుంచి బయటికి తేవాలనే నా ప్రయ త్నం, కొంతమేర విజయమందుతోంది. ఇటువంటి అభాగినుల పరిస్థితులు

చూస్తూవుంటే మనం ఎటు వెళ్తున్నామూ అని ఆందోళన కలుగుతుంది. సమస్తం రాజకీయాలతో ముడిపెట్టడంగాక చేతనైన మేర స్వచ్ఛంద సేవ చేయడంలో మనకు ఆత్మానందం కలుగుతుంది" - అన్నారు కుముద్‌బెన్ జోషి.... ఆటోగ్రాఫుల కోసం అరవై డెబ్భయి మంది చుట్టు ముట్టారు మాలతిని.... గెస్ట్ హవుజ్ కొచ్చి పది నిమిషాలు కూచుని యస్‌కె రావు ఇంటికి బయలుదేరాం.... మమ్మల్ని ఎవరు తీసుకు వెళ్తున్నారో, ఎవరు తీసుకొచ్చి దించుతున్నారో వారి పేర్లు కూడా సరిగా తెలియడం లేదు. యస్‌కె రావుగారిల్లు ఒక పఠన మందిరం – మధ్య మధ్య మిసెస్ రావు పెయింటింగ్సూ, అనేక దేశాలలో వారు సేకరించిన ఆర్ట్ పీసెసూను. ఆ పుస్తకాలయంలో కూచుంటే బయటికి వెళ్లాలనిగాని, మరొకరితో మాట్లాడాలనిగాని అనిపించక పోవడం సహజం. ఎందరెందరో మేధావుల ఆలోచనా తరంగాలు అంత చేరువలో ఉన్నప్పుడు ఊకదంపు మాటలు వినాలని ఎవరికుంటుంది? యస్‌కె రావు ఫారెన్ సర్వీసులో పని చేశారు; యునైటెడ్ నేషన్స్‌లో ఉన్నారు; టోక్యోలో కొంత కాలం ఉన్నారు; దేశ దేశాలు చూశారు; ఇక్కడ కాకినాడలో స్థిరపడ్డారు. మా యిద్దరికీ కామన్ ఫ్రెండ్ డాక్టర్ బాజీ. బాజీ గారికి ఇంకా చెప్పలేదు కాకినాడ వెళ్లి వచ్చినట్టు!.... పదిగంటలకి గెస్ట్ హవుజ్ కొచ్చేసరికి, రెండు చోట్ల నుంచి రెండు కారియర్లు వచ్చి వున్నాయి. ఒకటి చాలని, రెండోది పంపేసి, ఆ వుంచిన కారియర్లో అయిదో వంతు కూడా తినలేక, వాచ్‌మాన్‌తో అతని పిల్లలూ సంసారం గురించి మాట్లాడుతూండగా, వెనక భాగం నుంచి డైనింగ్ హాలులోకి యిద్దరు లేడీస్ వచ్చారు - 'రావచ్చునాండీ' - అంటూ. 'రండి - కూచోండి' అన్నాం.... 'ఈమె మావొదిన కమల - మీరంటే చాలా యిష్టమండి. మీరు రాసినవన్నీ చదువుతుందండి - పెద్దాపురంనుంచి ఈమె వచ్చేసరికి మీటింగ్ అయిపోయిందండి - మళ్లీ రాత్రికి పెద్దాపురం వెళ్లిపోవాలట. మిమ్మల్ని మధ్యాహ్నం సాయింత్రం చూశాను గనుక యిక్కడికి తీసుకొచ్చేశానండి..." - సన్నగా చామన చాయలో వున్న వనిత మాట్లాడుతోంది; సామాన్యాకృతిలో కాస్త తెల్లగా వున్న వనిత, మరదలు మాటలు వింటూ, కళ్ళు వొప్పగించి మాలతిని చూస్తోంది. నలుగురం హాలులోకి వచ్చామో లేదో, లక్ష్మిగారు (ప్రెసిడెంట్), వాణీ భాస్కరరావు, యింకా మరికొందరూ, ఏడెనమండుగురు దాకా, మమ్మల్ని పలకరించేందుకు వచ్చారు. "పొద్దుట్నుంచీ మీతో మాట్లాడటమే కుదరలేదు - ఏమనుకున్నారో ఏమో!" - అన్నారు లక్ష్మి, మాలతితో. "ఏమనుకుంటాను? - లక్ష్మిగారు ఎంత మంచివారు గాకపోతే యిందరిని కూడగట్టుకు యిన్ని పనులు చేయించగలుగుతారు - అనుకుంటాను.... రేపు

మధ్యాహ్నందాకా మనం ఎన్ని కబుర్ల యినా చెప్పుకోవచ్చు - గవర్నరుగారి విషయం ముందు చూడాలికదా...." - అంది మాలతి, ఆ తర్వాత అర గంట కబుర్లు, మర్నాటి ప్రోగ్రామ్ ప్లానింగూ అయాక, వారందరూ వెళ్లాక బామనబాయ వనిత, "మీరు రాసేవన్నీ మా అమ్మగారు, మా అయన, ఈ వొదిన ఎంతో శ్రద్ధగా చదువుతారు. మీతో మాట్లాడాలని మా అమ్మగారు ఎంతో అనుకున్నారండీ - చుట్టూ మనుషులుండటంవల్ల కుదర్లేదు" - అంది. "మీరిద్దరూ వస్తున్నప్పుడు ఆమెనికూడా తీసుకురాక పోయారా?" అని ప్రశ్నించింది మాలతి. "రేపు వస్తారండి - వీళ్లందరూ మీరు రాసేవి శ్రద్ధగా చదువుతారు - నేను ఒక్కటి కూడా చదవలేదండి మీరు 'స్వాతి' లో ప్రతి నెలా ప్రేమ కెర టాలు రాస్తారని మా కమల చెప్పింది" మాలతీ నేనూ నవ్వు ఆపుకోలేక పోయాము - కమల తన మరదల్ని తినేసేటట్టు చూసింది. "అవి ప్రేమ కెరటాలు కాదమ్మా - పాత కెరటాలు" అన్నాను. "ఏవో కెరటాలు - మా అయనగారికి ఆ కెరటాలు చాలా యిష్టం" - అంది సుందరి (నన్న మ్మాయి). తను అయిదో క్లాసు దాకా మాత్రమే చదువుకున్నానని, ఈ పత్రి కలూ పుస్తకాలూ చదవడం తనకు పడదనీ, చదవాలని అనిపించదనీ వున్నదున్నట్లు నిర్భయంగా చెప్పింది సుందరి. సహజమైన తెలివి తేటలకు పుస్తక పఠన తోడైనప్పుడు వ్యక్తి ఎలా రాణించేదీ చెబుతూ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి 'వడ్లగింజలు', చద రంగం ఆట, రాజుగారు పోటపోపటం టూకీగా చెప్పింది మాలతి ఎదుట వారు వింటున్నట్టు కనిపించాలేతప్ప హితోపదేశాల విషయంలో మేమిద్దరం ఒకరికొకరం తీసిపోము. "ఈసారి మిమ్మల్ని కలుసుకోనే సరికి నేనూ పుస్తకాలు చదువుతాను" - అని ఛాలెంజిగా తీసుకుంది సుందరి. ఒక్క పలచగా, మంచి ముఖ వర్చస్సుతో వున్న ఆ అమ్మాయి, యిద్దరు పిల్లల తల్లి అనీ, ఆమె భర్త (డా॥ సుధాకర్) సక్సెస్‌ఫుల్ డాక్టరనీ, వారికొక్క నర్సింగ్ హోమ్ వున్నదనీ, రెండు టాంకుల పెట్రోలు ఖర్చుతో ఒక వారం రోజుల్లో ఈమె కారు నడపడం నేర్చుకున్నదనీ, అనుకున్నది సాధించ గల సమర్థురాలనీ మర్నాడు గాని మాకు తెలియలేదు. పదకొండుదాటాక కమల, సుందరి వారి కారులో వెళ్లి పోయారు. తన అభిమాన రచయిత్రిపై ఆరాధన కమలకు; అందరూ చెప్పు కొనే మాలతీ చందూర్ తనకింత చేరువయారని సంతోషం సుందరికి.

.....19

రాత్రంతా వర్షం పడుతూనే వుంది - అరుగంటలకు కాఫీ కప్పులతో తలుపు తట్టాడు వాచ్‌మేన్ .... ఏడు న్నరకి డా॥ అలూరి విజయలక్ష్మి యింట్లో బ్రేక్ ఫాస్ట్. మాలతికీ ఆమెకీ ఏలూరు సెయింట్ థెరిసా అనుబంధం .... మేము కలుసు కోవలసిన భవానీ ప్రసాద్ దంపతులని కూడా బ్రేక్

ఫాస్ట్‌కి పిలుస్తానని చెప్పారు విజయ లక్ష్మి నిన్న మాటల్లో!.... మేము విజయలక్ష్మిగారి కారుకోసం చూస్తూ వుండగా, భవానీ ప్రసాద్, పద్మా తమ కారులోనుంచి దిగారు. పద్మఫాదర్ శేషాద్రి, అతని కాలేజీ రోజులనుంచి మాకు బాగా తెలుసు - శేషాద్రి యిప్పుడు ఇన్‌కమ్ టాక్స్ డిపార్ట్ మెంటులో అసిస్టెంట్ కమీషనర్ (మద్రాసులో); శేషాద్రి మోహనల పెళ్లి మాకు తెలుసు ; ప్రసాద్ పద్మాల పెళ్లీ మాకు తెలుసు (భవానీ ప్రసాద్ మోహనకితమ్ముడు). శేషాద్రి, పుష్పకి (శారదాంబ కోలీగ్) తమ్ముడైనట్లే మా శారదా మాలతీలకు కూడా తమ్ముడు. ఇక మామయ్య పట్ల, అంటే నా పట్ల, అతనికెంతో అభి మానం, స్వర్గీయ చలికొండ అప్పా రావుగారి (సెంట్రల్ ఇంటిలిజెన్స్) నాలుగవ కుమారుడు భవానీ ప్రసాద్ ; ఇద్దరు అన్నగార్లు స్టేట్స్‌లోను, ఒక అన్నగారు ఢిల్లీలోను ఉద్యోగాలలో ఉండగా తండ్రిని అంటిపెట్టుకు కాకి నాడలో ఉండిపోయాడు భవాని, అయిదారు నెలలక్రితం అప్పారావు స్వర్గస్థులయారు (జగతి - 387 - Pious Man,) అప్పారావుగారు మా కెంతో కావల్సిన వారు - ఆయన ఉత్తరాలు సాహిత్య పరిమళ భరిత ములై ఉండేవి. పితృవియోగం సంభ వించాక, సంతాప లేఖ వ్రాయడమే తప్ప భవానిని యింత దాకా చూడ లేదు .... ఒక పావుగంట పాత కబుర్లు చెప్పుకున్నాక విజయలక్ష్మి గారింటికి బయలుదేరాం.... నర్సింగ్ హోము నివాసగృహమూ పక్క పక్కనే వున్నాయి - కొత్త యిల్లు; ఎంతో చక్కగా ప్లాన్ కట్టించారు. రచ యిత్రిగా తెలుగు పాఠకులకు తెలిసిన ఆలూరి విజయలక్ష్మి, డాక్టరుగా కాకి నాడలో సుప్రసిద్ధురాలు. బ్రేక్‌ఫాస్ట్‌కి నందుల సుశీలదేవి కూడా వచ్చారు. ముగ్గురు రచయిత్రులు సారస్వత మధనం చేస్తూండగా, నేనూ భవానీ సర్వ సామాన్యమైన విషయాలు మాట్లాడుకున్నాం.... తుషార (విజయ లక్ష్మి కూతురు) నన్ను కూడా ఆటో గ్రాఫ్ అడిగింది. అక్కడ్నుంచి భవానీ ఇంటికి వెళ్లి, వారి అమ్మగారిని పరా మర్శించి, గెస్ట్‌హవుజ్ చేరుకొనేసరికి హోరున వర్షం. పదకొండు గంటలకి మమ్మల్ని లంచ్‌కి తీసుకు వెళ్లేందుకు లక్ష్మిగారు వస్తానన్నారు.... అంతటి కుండపోతలోను సగం తడుస్తూ ఫియ ట్‌లో నుంచి మెట్లమీద కొచ్చింది సుందరి.. "అంతసేపు కూచుని వారిని మనింటికి పిలవకుండా ఎలా వచ్చావు ?' - అన్నారండి డాక్టరుగారు. మాలతిగారు చాలా మంచివారు, ఆమె కీర్తిలక్ష్మి, సరస్వతీపుత్రి - నేను బతిమాలి, వొప్పించి తీసుకువస్తాను - అన్నానండి. మీరు మా యింట్లో పాదం పెట్టాలండి – తప్పదండి. లేకపోతే, యిక్కడే కూచుండి పోతా నండి" అంటూ సుందరి, పసిపిల్లలా మారాం మొదలెట్టేసరికి మాకు ఏంచేయాలో తోచలేదు. 'మా కాంప వుండర్ని కూడా పట్టుకొచ్చానండి.

మీ కోసం ఎవరైనా వస్తేకూచో పెడతాడండి: పది నిముషాలలో మళ్లీ దిగబెడతానండి. ఇంతకంటె పెద్దవర్షంలో కూడా నేను డ్రయివ్ చేస్తానండి''.... సుందరి మా యిద్దరినీ సునాయాసంగా వోడించేసి, కారులో కూచోపెట్ట గలిగింది. అది అంతులేని ఆపేక్ష. అమ్మగారికీ వాళ్లాయనకీ ఎంతో యిష్టమైంది గనక తనకీ యిష్టమట - డాక్టరుగారు యివ్వాళ తనని ఎంతో మెచ్చుకుంటారట.... హెూరున వర్షం, రిక్షాలు, గోతులు, వైపర్ వర్క్ చేస్తున్నా, మధ్య మధ్య గ్లాసు తుడవటం, ఫుల్‌స్టాప్ లేకుండా మాట్లాడుతూ పెర్‌ఫెక్ట్‌గా డ్రయివ్ చేయడం - ఇంటి బాల్కనీలోకి వచ్చింది ఫియట్. సుందరి చెప్పినట్లే ఎందరో పేషంట్లు వెయిట్ చేస్తున్నారు డాక్టరుగారి కోసం - మమ్మల్ని మేడ మీదకి తీసుకు వెళ్లింది - అమ్మగారికి పరిచయం చేసింది - ఇంతలో సుధాకర్ కూడా పైకి వచ్చారు. ఇరవై ఏళ్లగా చదువుతున్నారట ఆయన మాలతీ చందూర్ జవాబులు - తనని ఎంత ప్రభావితం చేశాయో చెప్పలేరట. 'స్వాతి' లోని నవలా పరిచయాల్లు కొత్త ప్రపంచం చూపాయట.... సుందరి ఎంత గలగలా మాట్లాడుతుందో ఆయన అంత ముక్తసరిగా మాట్లాడుతారు. కాదనగల ఆస్కారం లేకుండా మమ్మల్ని కానుకలతో ముంచెత్తి, కారు వెనుక సీట్లో మా యిద్దరినీ కూచోబెట్టి, తను డ్రయివింగ్ సీటులో కూచుంది సుందరి. వర్షం జోరు తగ్గింది గాని బాగా తుంపర పడుతోంది. "నా మాట కాదనకుండా మా యింటి కొచ్చారు - ఇంట్లో పాదం పెట్టారు - ఎంత సంతోషమో చెప్పలేను" - అని ఆ అమాయకురాలు తన హర్షాంతిరేక వెలిబుచ్చుతూ, గెస్ట్‌హవుజ్ వద్ద మమ్మల్ని దించినప్పుడు, పేరులోనే కాదు, హృదయంలో కూడా ఎంత సౌందర్యం వుంది - అనిపించింది మాకు

........లక్ష్మిగారు పది నిముషాలుగా మా కోసం వెయిట్ చేస్తున్నారు. వాణీ భాస్కర్రావు యింటో లంచ్, కావలసినన్ని కబుర్లు - బొబ్బట్లతో భోజనం. భోజనానంతరం ఘుమ ఘుమలాడే కిళ్లీలు నములుతూ, అమ్మాయిలిద్దరూ పాడిన పాటలు ఆలకించడం, ఉమ, పద్మ వచ్చి సామర్లకోటలో రైలెక్కించడం, ప్రయాణంలో పేర్రాజుగారితో (రాజమండ్రి నటరాజా థియేటర్) రాజకీయాలూ సినిమాలు గురించిన కబుర్లు, ఇరవై ఉదయం నాలుగున్నరకి సెంట్రల్; అయిదు గంటలకి కచేరి రోడ్‌లో 'షిబూ' స్వాగతం

....కాకినాడ ప్రయాణం ఒక కమనీయానుభూతిగా చేసిన అందరికీ మా వందనాలు. ఆ అనుభూతికి విహ్నంగా షోకేసులో సీతారామలక్ష్మణులు రజత కాంతులతో!

. . . . . 25

హెూరున వర్షం పడుతున్నా యివ్వాళ ఉదయం నిర్మాత వెంకన్నబాబు ఆఫీసులో మద్రాసు తెలుగు ఫిలిమ్ జర్నలిస్ట్స్ అసోసియేషన్ వారి సర్వ సభ్య

సమావేశం జరిగింది. వోటింగ్‌తో నిమిత్తం లేకుండా ఆయాస్థానాలకు ఏకగ్రీవంగా కొత్తవారు ఎన్నికయారు- అధ్యక్షులు ; శ్రీనివాస్ ; కార్యదర్శి ; ఎమ్. నరసింహం ; ట్రెజరర్ : డాక్టర్ మలికార్జునరావు. నిర్మాతలకూ, పత్రికలవారికీ ఎంతో సన్నిహితులైన శ్రీనివాస్, తనపై మోపిన బాధ్యతను ఎంతో సమర్థవంతంగా నిర్వహించగలరు.

. . . . . 26

'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మ విదులు వేదాంత మనియు, .. బరమ పౌరాణికుల్ బహు. పురాణ సముచ్చయంబని మహిగొనియాడుచుండ, వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసు డాదిముని పరాశరాత్మ జుండు - విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండ జేసె భారతంబు, - అంటాడు, నన్నయ ఆది పర్వం ప్రథమాశ్వాసంలో.... ఇంతకీ కౌరవులు కరెక్టా పాండవులు కరెక్టా ? ఎవరి పక్షాన న్యాయం ఉన్నది ? కూతురు పిల్లలకే రాజ్యాధికారం సంక్రమించాలని సత్యవతి తండ్రి షరతు పెట్టాడు ; ఆకారణంగా దేవవ్రతుడు (భీష్ముడు) అజన్మ బ్రహ్మచారిగా మిగిలిపోవలసి వచ్చింది. సత్యవతి తనయుడైన విచిత్ర వీర్యుడు రసస్వంతుగా మరణించగా, అతని భార్యలకు కలిగిన పిల్లలు ధృతరాష్ట్రుడు; పాండురాజు - ఒకరుపుట్టు గుడ్డి, మరొకరు పాండురోగి ('అది వ్యాధికాదు - అతను తెల్లగా ఉండేవాడు' అని పాండవుల తరఫున్యాయవాది వాదించాడను కోండి - అది వేరే విషయం). కుంతీదేవికి కలిగిన పిల్లలు కూడా మళ్లీ వరప్రసాదమే (యమ వాయు, ఇంద్ర దేవతల కనికరం), రాజ్యము వీర భోజ్యమైనప్పుడు, సుయోధనుడు చేసిన తప్పేమిటి ? ధృతరాష్ట్రుడు ఒక తడవ దయాంతఃకరణతో వాపసు చేసిన రాజ్యాన్ని, జూదవ్యసనంతో మళ్లీ పణంగా ఎందుకు పెట్టాడు యుధిష్ఠరుడు ? తన రాజ్యాన్ని పందెం కాయగల అధికారం రాజుకున్నదా ? 'తానోడి నన్నోడెనో, నన్నోడి తానోడెనో' - అనే ధర్మ సూక్ష్మం కనుక్కు రమ్మని ద్రౌపది సైతం ప్రశ్నించింది. కృష్ణుడు పాండవ పక్షం గనక, పార్థసారథిగా తన పథకం నెరవేర్చుకో గలిగాడు గనక 'పాండవులు చేసినది ధర్మమవుతుందా, అది న్యాయమవుతుందా .... అవధాన శేఖర్ ప్రసాద రాయ కులపతి (గుంటూరు), నాట్యావధాని ధారా రామనాధశాస్త్రి (ఒంగోలు) పాండవ న్యాయవాదులుగా. కవిరత్న వివియల్ నరసింహారావు (హైదరాబాదు) ప్రౌఢ కవి వృషాద్రిపతి (రేపల్లె) కౌరవ న్యాయవాదులుగా, సాహితీవల్లభ కె వెంకట శివయ్య ఐ ఎ యస్ (రెవిన్యూ సెక్రటరీ, హైదరాబాదు) న్యాయమూర్తిగా, కళాసాగర్ వారు రాణీ సీతయ్ హాలులో ఏర్పరిచిన 'మహాభారత న్యాయ దర్శనం' ఒక అపూర్వ

మైన సాహితి ప్రక్రియ. ఈ యిరు పక్షాల వాదమూ ఈ ప్రయోగమూ, మహాభారతం వైపు మిమ్మల్ని మళ్లించి మీకుగా మీరు తెలుసుకోండి - అని ఉద్దీపింప జేయడం వరకే మాలక్ష్యం - అని శివయ్యగారు ప్రారంభంలోనే చెప్పారు .... ముఖ్య అతిథిగా విచ్చేసిన మద్రాసు జిల్లా కలెక్టరు భుజంగరావు ఐఎయస్, న్యాయరీత్యా కౌరవులని తప్పు బట్టడం కష్టం - అంటూ ఆయన కూడా సభికులని ఆలోచింప జేసే రీతిలోనే తుదిపలుకు చెప్పారు. రెండున్నర గంటలసేపు, ఒక్కరు కూడా సీటులో నుంచి కదల కుండా శ్రద్ధగా ఆలకించారు. ఇంత రసవత్తరమూ భావస్ఫోరకమూ అయిన కార్యక్రమం ఏర్పరిచిన కళాసాగర్ అధ్యక్షులు యమ్మెస్ రెడ్డి అభినందనీయులు - సహజకవిలోని సాహితీ సుగంధమది.

. . . . 29

దర్శకులు జనార్దన్, ఔత్సాహిక నటీనటులకు శిక్షణ యిచ్చే నిమిత్తం 'అభినయ' అనే పేరుతో, తిరుపతి, కడప, నెల్లూరు, రాజమండ్రి విశాఖ పట్నం యిలా పది కేంద్రాలలో విడియో ద్వారా తరగతులు నిర్వహించారు. ఆశలూ ఉత్సాహమూ వేరు, అభినయ కౌశలం వేరు. ఆకౌశలం అలవడేందుకు ఎంతో దీక్ష కావాలి, కృషి కావాలి. నటనపై అభిలాషవున్న యువతీ యువకులకు ప్రోత్సాహకరంగా ఉండే ఈ ట్రయినింగ్ యిచ్చేందుకు ఒక ప్రిన్సిపాలూ యితర అధ్యాపకులతో జనార్దన్ చేస్తున్న ప్రయత్నం ప్రయోగాత్మకమూ ప్రయోజనకరమూను. విడియో ద్వారా ఈ శిక్షణ నిర్వహించడం వల్ల, ఎవరు ఎంతమేర రాణించగలిగేదీ తక్కువ వ్యయంతో, తక్కువ శ్రమతో కళాకారులూ అధ్యాపకులూ పరస్పరం తెలుసుకో గలుగుతారు. టివి లోనూ, సినిమా లోనూ కొత్త ముఖాలకు అవకాశమివ్వగల ఈ కళాత్మక కృషి విజయమందాలనీ డైరక్టర్ జనార్దన్ శ్రమ ఫలించాలనీ మా ఆకాంక్ష.

—యన్నార్ చందూర్

కక్ష తీర్చుకోవలసిన సమయంలో, తగిలిన గాయాన్ని మరచి క్షమించ బూనినప్పుడు, మానవునిలోని ఆత్మ, చైతన్య దీప్తి, నొందుతుంది.

—చాపిన్

కుటిల మనస్కులు తమ తప్పులని తమ నుంచీ, యితరుల నుంచీ కూడా దాస్తారు. సజ్జనులు మాత్రమే తమ తప్పులు బాహాటంగా అంగీకరించ గలుగుతారు.

—లారో.

జ్ఞాపకం పెట్టుకోవడం ఒక ఎత్తు; తెలుసుకోవడం ఒక ఎత్తు. జ్ఞాపకానికని వొప్పగించిన విషయాన్ని భద్రపరుస్తుంది జ్ఞాపకశక్తి. తెలుసుకోవడమనేది అలా కాదు - మీలో అంతర్భాగమై పోతుంది.

—సెనెకా

విమర్శకుల విశేషంతో
విడుదలైన ప్రతి కేంద్రంలో
విజయభేరి మోగిస్తూ..




—అన్ని తరగతుల ప్రేక్షకుల్ని
—అలరిస్తున్న 'ఆనందమందారం'

JAGATI Telugu Monthly - Vol. 34 - No. 389 - Dec 88
Edited, Printed and Published by N. R. Chandur at
MANASA PRESS, 2 Kutchery Road, Madras-600 004
Phone: 7 6 6 9 7